చ॥ రమణిఁ గుచద్వయింబ్రతి సరంబుల రాయిడి నంగ
రాగము । న్ననువుగఁ జేయుచున్నవిల సన్నిజహారముఁదీసి
వైచియు । యుమతరుణాకర్ణ పింగముఁబయోధరఘర్షణ
శీర్ణసంహతి । క్రమముగ నార చీరమెడఁగట్టినవారితనిశ్చ
యంబునన్॥ (౪౯)

క॥ ఆరమణిమొగముకచముల । చేరాజిలినట్టుజడల చేవె
లుఁగొందెన్ । వారిరుహముఖులబలెనొక । యోరన్నైవలముఁ
గూడియుబ్రాజిలుఁగా॥ (౫౦)

గీ॥ తరుణిపులకలెసఁగఁ దపమునకై ర్త్రిరా । వృత్తమాంజి
మొలధరించెఁదివిరి । యుదియమొదలుగాఁగ నామాంజితన్ని
తం । బంబుమిగులలోహితంబుఁజేసె॥ (౫౧)

చ॥ సరసిరుహాక్షి యూసక రసంబొకయించుక లేసి
మోవిపై । గురుకుచదుర్గసంభరిత కుంకుమలోహిత మై
నబంతిపైఁ । దరలఁగ నీకరోయుతశ్రీ దర్భలు గంటిన వ్రేళ్ళ
నొప్పుత । కూరమునన పుష్పమాత్రమును గైకొనియోర్చి దనయం
తనింపునన్॥ (౫౨)

చ॥ పలుమఱుమున్నమూల్యమగుపానుపుపైఁబరివర్తనం
బుల । నొప్పెలుపటి రాలియున్నసిగ పూవుల గాసిలువార బా
హువే । తలగడగానిరాస్తరణ ధాత్రితలంబదిచాపశయ్యగా ।
సలిపిపరుండెనావికచ సారసలోచనబత్తినత్తఱిన్॥ (౫౩)

గీ॥ మగుడవానిఁజెంద మదినెంచివ్రతవేళ । లతలయందుఁదమ
నవ్విలాసచేష్ట । హరిణకాంతలందు నాలోలదృష్టిని । క్షేపము
నఁగరెండుఁజేర్చెరెంట॥ (౫౪)

చ ॥ ఎనయఁగ నింకమీఁదజని యించుకుమారున కేనిము
న్నుపు । ట్టినయల వానిపై నెనరు డీల్వఋపంగ వశంబుగాని
య । ట్లనఘఘట స్తనప్రస్రుత మైనపయస్సున సర్వమంగళా।
వనజదళాయతేక్షణకృపన్బెనిచెఁ నవపాదపంబులన్॥ (౫౫)

చ ॥ చెలియలు గుంపుగూడుకొని చెంగటనుండినవేడ్క
యెంతయు । నైలఁగఁదదీయనేత్రముల చేఁదనకన్నులు గొల్చు
చుంటకై । యలవడ నమ్మివచ్చునటు లంగనదోయిట వన్యబీ
జముల్ । గలయఁగ నించియచ్చటి మృగంబులకిచ్చియనూన
యించెడిన్॥ (౫౬)

గీ॥ ఒనరఁదానమాడిహోమంబుఁజేసివ । ల్కలము గప్పి
జపముసలుపుకన్య । ఋషులువచ్చి చూచిరిలధర్మవృద్ధుల।
యాదువయసాకింత యరయఁబడునె॥ (౫౭)

గీ॥ కంటుమెకములుపగమాని యుంట్రమాఁకు । లతిథిస
త్కృతిఫలములనాచరింపఁ । బర్ణశాలలయందగ్ని పరఁగభు
వన । పావనంబయ్యె గిరిజాతపోవనంబు॥ (౫౮)

చ ॥ పడఁతుక యంతమాత్రము తపంబొనరించుట చేత
బాలసా । ఫలము లభింపదన్ తలఁపు భావమునన్ జనియిం
పనంతనిం । పెలయు నిజాంగమార్దవ మొకించుక యేని
గణింపకాత్మలో । బలితము దారుణంబగు తపంబొనరింపఁగఁ
బూనెధీరతన్॥ (౫౯)

ఉ॥ కందుకకేళివేళ మునుగాసిని జెందుచునున్న గౌరిబ।
ల్వొందుగఁ గ్రూరమైన తప ముంబచరింపఁగఁ బూనె నప్పు
డా । యందపు విగ్రహంబు కనకాంబుజ నిర్మితమానుగా

ననిం । పొందు నిసర్గ మార్దవము నూనకఠోరత యున్న
హించెడిన్ ॥ (౬౦)

చ ॥ అతివ తపస్త్వసందు దరహాసముమోమున లంకరిం
పను । న్నతచతురగ్నులుం దనకునల్లడలన్ జ్వలియించు చుం
డను । ద్ధతగతి దృగ్విరోధి యగు దారుణతేజమధః కరిం
చితా । నితరము నేమి యుంగనక యెట్టిని వేల్పనె చూచె
నొక్కనిన్ ॥ (౬౧)

గీ ॥ ఇనమరీచి వితతి నిటుతప్తమౌనింతి । ముఖము తమ్మి
పూలు బొందనప్పు । డల్లనల్లనదదపాంగయుగ్మంబున । నుష్ప
తిల్లెఁ జెలువఁ గప్పుచాయ ॥ (౬౨)

గీ ॥ పాదపంబులు జీవించుపగిదిగాఁగఁ । గోరివేఁడకయే
దొరకొన్న నీరు । నమృతమయ చంద్ర మఃకర సమితి యి
విదె । బోనముఁగ జేసివతిన్ంచెఁ బువ్వుబోఁడి ॥ (౬౩)

క పంచాగ్నులు తనుమిగులఁద । పించఁన్గ్రీష్మాంత మ
దినవీనజలముఁబోఁ । షించఁగ ధారుణి తోడఁ ద్య । జించెన్
బైయావి రెల్లఁ జెలువరయమునన్ ॥ (౬౪)

ఉ ॥ కుంచిత రీతిఁ దొల్తఁ జినుకుల్జల జేక్షణపక్ష్మ పఙ్క్తు
లన్ । దించుకసే ప్పునిల్చి డిగ నేఁగుచు వాతెఱ తాడనంబుఁ
గా । వించికుచా ద్రిపాతమున వేనుఁబుమైవళి రాజిజాతిఁ । యు
భ్యంచిత మైనపాక్కిట రయంబునఁ జొచ్చి యదృశ్యతన్
గానెన్ ॥ (౬౫)

క ॥ ఎడయక తెమ్మెర పొదలెడు । జడులనాశిల పయిఁబం

డు జవ్వని వ్రతముల్ । గడుకొని మెఱుంగు చూపులఁ । బొ
డగనె సాక్ష్యమున నొప్పఁబూనినరజనుల్ ॥ (౬౬)

మ ॥ చలిగాలిం గడు దుస్సహంబులగు పౌష క్రూర రా
త్రుల్మహా । జలమధ్యంబున నిల్చి మోలఁ జెలువౌ సంఘో
గముం బాసి బ । ల్విలుగుం జెందిన కోకదంపతులపై శ్రీమత్కృ
పాదృష్టియు । న్వెలయం జేయుచు నాయెడం గడపె నావిం
బోష్ఠి చిత్రంబుగన్ ॥ (౬౭)

శా ॥ భూరిస్ఫార తుషార వర్షమున నంభోజస్ఫురత్సం
పద । ల్దారం జేగఁగఁ గాంతిహీనమగు తత్తోయంబున న్నే
ఝునా । నీరేజేక్షణ కంపితాధర దళోన్మిద్రాత్మ వక్త్రంబు
నం । దారమ్యద్యుతిఁ గూర్చెఁ దామరస సంధానంబు గా
వించెనా ॥ (౬౮)

సీ । తమయంత రాలు పర్ణములె భక్షించుట ప్రథితత
పో గౌరవంబుజగతి । నుమయది యును లేక యుంపుటవిద్వాం
సు లామెక పర్ణయన్నామమిడిరి । రేపవలీలీలఁ దాపస ప్ర
తముల మృదులాంగ మిడుముల కిరవుఁ జేసి । కర్కశాంగులు
మునుల్గావించుతపము నధఃకరింపుచు నుండెఁ దరుణి యపు,
డు । పొలుపు దండాజినంబులు పొరిడపల్క । లలర సద్బ్ర
హ్మతేజంబు వెలుఁగుచుండ । మైధరించిన తొలియాశ్రమంబు
పోల్కి । జటిలుఁ డొకడింతి యాశ్రమస్థలికి వచ్చె ॥ (౬౯)

చ ॥ అతిథులపూజగోరెదు హిమాద్రికుమారి గురుత్వ
పూర్వమౌ । నతుల సపర్యలన్యముగ నప్పుడెదుర్కొనె సా
మ్యముబిడనం । చితముగఁ గల్గినందను విశేషములం దృఢ

గాంగ జలముచేత | నేనినీదుంఘ్రి నీచేతఁబోలెఁబూ| తుం
డుగాఁడుకులము తోడమున్ను ॥ (౭౫)

చ ॥ అరయఁగనర్థ కామములయందుఁ బ్రవృత్తి వహింప
కుండని | క్కరణిని నీవనారతము గాసిలి దీనిభజించుచు
న్కనే | వెరవుగ నీయెడ న్హృదయ వీధిఁ బల్కరు నెంచిచూ
డనో | తరుణిత్రివర్గ మందునొక ధర్మము శ్రేష్ఠముగాఁ
గఁ దోఁచెడిఁ ॥ (౭౬)

క ॥ నీ సత్కృతి నొందిననను | నోసతి పెఱ వానిఁ జేయ
నొప్పుదుపృథువి | ద్యాసరసులు నేస్తంబనఁ | గాసొప్తపదీ
నమంత్రము గాదేజగతిఁ ॥ (౭౭)

గీ ॥ కానఁ దాలిమిచే మించుచాన నేను | బాడ బుఁడ
నాటఁ జపలత వేఁడికొందు | నది రహస్యముగాదేని యధిక
మోద | ముప్పతిల్లఁగ నాతోడఁ జెప్పవలయు ॥ (౭౮)

గీ ॥ నలువ కొలమునఁ బుట్టువు చెలఁగు త్రిజగ | దమల
రూపంబుఁ బోలు దేహంబు నూత్న | యౌవ నంబు మహై
శ్వర్య మఖిలమున్న | నింకఁ దపమాచరించెద వేటికబల ॥

క ॥ లలిగా సహింపఁ గూడక | మలయు ననిష్ట మును
బొందుమా నినులకుని | ట్లలరుం దపంబునీకడఁ | దలపఁగఁ
నదియేని కానఁదామరసాక్షీ ॥ (౮౦)

సీ ॥ పతిపరాభవమును బడయదీయాకృతి పుట్టింట నవ
మతిపొసఁగ దెపుడు | పరుఁడునిన్నెనకఁడు ఫణిఫణామణికి నై
సాహసంబునఁగేలు సాచునెవ్వఁ | డడరి జవ్వనమునఁ దొడ
వులుసడలిచి ముదిమికిఁ దగునార మొలనుగట్టి | తబలప్రదో

పసున్యక్తేంద నక్షత్రయగు రాత్రియరుణున కిహ్వాయగునె। స్వర్గకామ శ్రమంబన్నఁజాలుఁదంఘ్రి। తాపులే దేవ భూములు ఫపునిఁగోరి। తెనితపమేల మఱికొను వాసివెతక।ద వనిఁగొను వాఁడెరత్నంబు నరయుఁగాదె॥ (౨౧)

చ॥ యువతి! రో వేఁడివేఁడియగు నూరుపుచేఁబతిగోఁరితీ గఁటం। చవగతపుర్స్యొ నాకు నటులై ననుసందియమంచె ఁదవమీ। భువినిటు ప్రార్థనాపాఁత్రుఁడగు పూరుషుఁ డెవ్వఁ డొకాన రాఁడుకాం। క్షమొడమి నంతదుర్లభుఁడొకండును రేఁడు మదిందలంచినర్ల॥ (౨౨)

చ॥ తలఁపఁగ నింతకాలమవతంస మహోత్పల శూన్య గండమం। దలఘు జటాభరంబు కలమూగ్ర శిరంగము ప్రే లుచుండఁగా। బలుతపమాచరించు నిను వారకుపేక్ష యొన ర్చినట్టిని। వలచినవాని డెంద మదివజ్రసమానమనంగఁ జె ల్లదే॥ (౨౩)

ఉ॥ తామసవృత్తిమాని జపదారి వ్రతంబులఁ చే గృశిం చియూ। గాములజేనితాపమునఁ గ్రాఁగిన సొమ్ము లయిమ్ము లొప్పఁదే। జోమహనీయవాసర మృగాంకకళంబురుడించుని న్నునో। భామిని చూచినం బ్రతుకు వాఁడెవఁడైనఁ దపింప కుండునే॥ (౨౪)

ఉ॥ కుంచితపక్ష్మమై సొగసుగూరిది చూచెడి నీదుకంటి క। భృంచితమానిజాన నము నారయఁ జూపక యుంట నీ పుకా। మించినయట్టి పూరుషుఁడు మీనని ఛేషణ సూపునా

చ॥ తనరఁగ శూలపాణి చరితంబులు పాడుచునుండి కిం
కమునం । దునుబలు మాఱుశబ్దములు తొట్రిలఁ బల్కి గిరీంద్ర
కన్యము । న్వనమున గాన మాధురికి వారక నెచ్చెలులైన కి
న్నరాం । గనలకు నీక్షణాజ్ఞములఁ గ్రమ్మఁగఁ జేసె మహాశ్రు పూ
రముల్ ॥ (౯౦)

చ॥ నెలఁతుక వేఁగునంత కును నిద్దుర లేక యె యుండి
యూరయొప । న్గడితిపు చింతతోడ క్షణకాలము గన్నులు మూ
సియప్పుడే । కలఁగని వామదేవ యెటకై చనె దీవని భ్రాంతి మీ
ఱఁగాఁ । బలికె యసత్యపు స్వప్నము బన్నఁగఁ గాఁగిటఁ జేర్చి
మేల్కనున్ ॥ (౯౧)

చ॥ ఇదపడి ధాత్రిలో విబుధ వర్యులు సర్వగతుండ వం
ద్రుని । న్నిది నిజమేని నాదయిన యింగిత మెట్టు లెఱుంగకుం
డు వం । చు కరకె యాత్మహస్త తలమందు లిఖించిన నీల కంఠు
రు । న్నదిగఁ జే యింపకే తెగడె పూఁచెలి గోల తనంబు గ్రా
లఁగన్ ॥ (౯౨)

సీ॥ ఎప్పుడీపతి హాసు నెనయంగ నన్యపూ వెరవెద్దియు
నులేమి వెతలఁ బడెనో । యప్పాపుతినతండ్రి యానతి మమ్ముఁ
గొంచి తపమున కీవన ధరణిఁ జేరెఁ । దాను పెట్టిన చెట్లు తప
ము నీక్షింపుచు ననుపమతర ఫలం బందియున్న । నీశనిమిత్త
మానింతి మనోరథ మీరిక యేనియు నెత్తదయ్యె । దున్న
యుండఁగ జడిలేని మన్న మహిపు । పగిదివ్రతకృశి సత్స
ఖిబాష్పయుక్త । నయనపరిస్రుత్య మాననిన్నాతినాఁతఁ । జ
న్నఁటి కనుగ్రహించునో యేమొఱుంగ ॥ (౯౩)

గీ॥ ఇంగిత మెఱుంగు చెలి భావమిట్లు దెలుప । సతత నైష్ఠికుఁడతఁడు తోషంపుచిన్నె । లెఱుఁగరాకుండనుముఁజూచి యిందువదననిక్కమాయిది పరిహాసమొక్కొయనిన॥ (౯౦)

క॥ అంగుళి సంకోచనపటి । మంగను హస్తమున నక్షమాలిక నిడియా । యంగన మితవర్ణాలస । దృంగింగడుయత్నమునను బల్కెనతనితోన్ ॥ (౯౫)

గీ॥ ఈవు విన్నడియే నిక్కమే నుపూన్కి । నున్నత స్థానమును గోరియుందునాదు । నియమమాకోర్కె సాధింపనేరదైనఁ । గామవిషయంబుగానిది గలదెయనిన॥ (౯౬)

గీ॥ వినివడుగు నేనెఱుంగుదు మును మహేశు । నతఁడశుభకరవర్తనరతుఁడు నీవు । వానిఁగ్రన్ననఁగోరెదు గాననాకు । నిన్ననుసరింపబుద్ధి జనింపదయ్యె ॥ (౯౭)

క॥ ఈపగిదిననురూపుని । నీపతిఁగాఁగోరెదీవు నీహస్తంబా । పాపకడెంబుల కరమున । నాపశుపతి పట్టకొనిన యప్పుడెట్లోర్చున్ ॥ (౯౮)

సీ॥ ఇంతిరో నెమ్మది నీవె చింతింపుము కలహంస చిహ్నామావలువనీది । నెత్తురువిడిచెడి కృత్తియాశివునిదీ రెంటికిగ్రంథి యేరీతిఁబొసఁగు । మందిరంబునఁబుష్ప బృందంబుపైఁ ద్రొక్కుతోడ భాసిల్లునీ జాడలింక । బిత్రువనస్థలిని విస్తృతకేశ ములనుంట కహితుఁడేనియు దుఃఖమందఁడెట్టు । లభవు కౌఁగిలినీ కుసులభమయ్యైన । నింతకన్న నయుక్తమింకెద్దిగలదు । ము

న్నగంధముఁబూయుని చన్నులందుఁ। గాటిబూదివసింపంగఁ
గలదుతలఁప॥ (౯౯)

క॥ ఇదియొకపరిహాసంబగు। నదరకఫాలాక్షుఁబెండ్లియాడి
గజముపై। ముదముననెక్కందగునీ। వెదనెంచక యెద్దునెక్క
నెల్లరునగరే॥ (౧౦౦)

గీ॥ కాంతిమతియును జననేత్రకౌముదియును। నైనయా
చంద్రరేఖయునబలనీవు। గరళకంధరుఁ గామించు కతననిపు
డు। ధరణిరెండునుదుఃఖింపఁ దగినవయ్యె॥ (౧౦౧)

సీ॥ విషమనేత్రముకల్మివెగటైన యొడలును దలిదండ్రులె
వ్వరో తెలియరాదు। కట్టఁగాఁ బట్టమొక్కటియును లేమిఁనూ
హింపఁగా ధనమ్మెు నెఱుక పడియె। సతతంబుఁ బ్రేతసంగ
తినున్కినాతని చెలివిలోకులకెల్లఁ జెల్లమయ్యె। వరులయందె
ద్దానినరయుదు రదివాని యందొకించుక యేనియమరదయ్యె।
నీదురీప్సితంబు నిఁకమాను మీవేడ। నాతఁడెడఁ గోమలాంగి
జగతి। సాధుజనుఁడుయూప సత్కృతిఁగాటిలో। శూలము
నకుఁజేయఁజొచ్చునెట్లు॥ (౧౦౨)

క॥ పదపడివడుగిటునుడువఁగఁ। బెదవిని గదలించు కినుక
పెల్లుగమదిలోఁ। బొదలఁగబొమలున్ముడివడ। సుదతీమణి వా
లుఁగనులశోణంబెసఁగఁ॥ (౧౦౩)

గీ॥ అనియెనన్నునిట్టులంటివిగాననీ। వీశుతత్త్వమించుకే
నియెఱుఁగ। వనుపమమునచింత్యమగుమహాచ్చరితంబు। నీస
డింతురజ్ఞులెఱుఁగలేమి॥ (౧౦౪)

ఉ॥ పొంగుననఘ సంతతులఁ బోవఁగఁ ద్రోయఁగఁ బూని
నాతఁడు। త్తుంగవిభూతులందభిర తుంబుసుమాల్యవిలేపనాదు
ల। గ్రంగుగఁదాల్చెడిన్స్వపన రక్షకుఁడు న్విగతాశుఁడైన స
త్సంగపుఁడాసగొల్పిమన ముంగలఁగించెడువానిఁగోరు నే॥ ()

సీ॥ బలుదీనుఁ డయ్యును గలిమినిచ్చానంబు కాట నుండి
యును లోకముల కేఁడు। భయదరూపుండయ్యుఁ బరమశివుం
డగు వానితత్త్వమెఱుంగువారు లేరు। పాముఁబట్టిన భుజంగ
ములఁదాల్చినఁ దోలుగట్టినమంచి చేలఁగొనినఁ। బునుకధరించిన
వనజారిఁబూనిన నష్టమూర్తికిసర్వమునువకాదె। యతని నె
మ్మేననలఁదినకతనఁగాటి। బూదిమిక్కిలి శుద్ధమై బొందలుచుం
డుఁ। దాండవమ్మొగిఁగావించుతఱినిరాలు। దాని నమరులుత
లలపైఁదాల్చికొనరె॥ (౧౦౬)

గీ॥ దీనుఁడగుచు నెద్దుపై నెక్కుచున్నదై। రావణంబు నె
క్కుదేవవిభుఁడు। మాళికల్పరజము రాలునుండఁగఁదడం।
ఘ్రిలకుమ్రొక్కుచుండు నలరి యెపుడు॥ (౧౦౭)

సీ॥ దోసమాడుచును దద్దూజటిని గాంచి పల్కితిపా
కలగ్గుపల్కు నెవనిఁ। గమలాసనునకును గారణమందు రాతని
కిని జననియుజనకుఁ డెవరు। చాలునీకలహ మీవేలీలవింటివో
యదినిక్కమాతఁడు నట్టివాఁడె। నామదియిదియాశఁ గామిం
చుచున్నది కామస్థితుఁడు సడి కేమివెఱచు। ననుచుఁజెలియ
పినిఁబనుపుము మఱియేమొ। చెప్పఁబూని యున్న చెలువు
దోఁచె। సాధుజనులనింద సల్పుచుండెడివాని। కంటె విన్న
వాఁడుఁ గలుషమందు॥ (౧౦౮)

చ॥ ఇవెయి చెనేసపో యెద నీకేమిటికీతనితో వివాదముం।
చదరికుచాగ్రవల్కలము రయంబున జాఱఁగ నేగుపార్వతీ। మ
దనతిఁ గాంచినప్పుడు మానుషమైన నిసర్గవేషముం। గు
దురుగఁ దాల్చి శంకరుఁడు కొంకక యాచెలిచేయిఁ బట్టినన్॥ ( )

ఉ॥ అమ్మహనీయుఁ గాంచి త్రప యమ్మునఁ గంపము స్వేద
మంగమం। దెమ్మెఁ దలిర్పఁ నుంచుటకు నెత్తిన పాదము నట్లె పూ
నిమా। గమ్మునఁ బర్వతవ్యతికరమ్మున వ్యాకులమైన యేటి
సా। మ్యమ్మున నద్రిరాజతనయామణి యేగక నిల్వకున్నెడన్॥

గీ॥ కొమ్మ తపముల చేనన్నుఁ గొంటివేను। కింకరుఁడనైతి న
నిపల్కె శంకరుండు। మగువ నియమజకష్టంబు మఱచె ఫలముఁ।
గొన్న వెనుకను గష్టంబులెన్నఁబడునె॥ (౧౧౧)

అంత॥

క॥ గిరిసుత పొంతననున్నని। శ్వాసనకు సఖితోడఁ జెప్పి పని
చెన్నాకు। స్మరహరుఁడగు పర్వతనాయకు। నరసత నడిగిననతం
డాసంగునునన్నన్॥ (౧౧౨)

క॥ అనవదిహరునకుఁ జెప్పం। గను బార్వతి హరుని చెంతగా
దిలిని ల్చెన్। సకోకిలపల్లవసం। తునికై నిభృతయగుమా
విత్తో సకియగుచున్॥ (౧౧౩)

క॥ అతఁడపుడు చేసెనసరకడు। జతనంబున నమను విడిచి
సంభ్రమమెసఁగన్। మహనంగిరసుఁడు మొదలగు। చతురుల
సప్తర్షివరుల స్మరియించె వెసన్॥ (౧౧౪)

క॥ ఆసప్తర్షులరుంధతి। తోసతాంతులనభంబతులగ

తివెలుఁగం । గాసర్వజ్ఞునిముంగల । వాసిగఁగనుపట్టిరపుడవా
రితభక్తిౕ॥ (౧౧౫)

సీ॥ తీరసంభూత మందార భూరుహ పుష్ప వారసంగత
వీచిచారువులును । గలితదిక్కరిమద గంధ బంధురములౌ న
భ్రీగంగా ప్రవాహముల యందు । స్నాతులై ముత్తెంపు జ
న్నిదంబులుదాల్చి లలితరత్నాక్ష మాలలుగ్రహించి । మహి
తచతుర్థాశ్రమంబుఁ జేకొనియున్న కల్పవృక్షములునాఁగా
నవచ్చు । వారిఁగని క్రిందనేగడు సూర్యుఁ డపుడు । తనదు
ధ్వజమమ్మహాత్ములఁ దాఁకుననుచు । వంచినటిఁజేసి యాజ్ఞఁగా
వించుదాఁకఁ । జూచుచుండెను జనులెల్లఁజోద్యమంద॥ ()

సీ॥ కల్పాంతమను విపత్కాల మందాసక్త బాహాలతిక
యగు వసుధతోడ । నాదిభూదార దంష్ట్రాగ్రమం దొప్పఁగా
విశ్రమించినమహా విబుధవరుల । బ్రహ్మకన్ననసంత రముస్సృ
ష్టిశేషంబుఁ గల్పించుకతననీ ఘనులెప్రతన । ధాతలంచుఁ బు
రాణ తత్వవేదులచేత బహువారముగఁ జెప్పఁబడెడువారిఁ ।
బ్రాక్తనంబులునత్యంత పావనములుఁ । బక్వములునైనతపము
లఫలములెల్ల । ననుభవించుచుఁ దపసులైతనరువారిఁ । గాం
చెముందట నానీలకంధరుండు॥ (౧౧౬)

గీ॥ వారినడుమ నరుంధతీ వారిజాక్షి । నేతపదముల పైఁ
జూపునిలిపిమహిమఁ । జెలఁగు మైతోడితత్తప స్సిద్ధియనఁగ।
నలఘుతరమగు కాంతిచేవెలుఁగుచుండె॥ (౧౧౭)

క॥ ఆరమణినిమునివర్యుల । నారఁగసామాన్యదృష్టి నభ

వు(డుసూచెఁ। నారీపూరుష భేదం । బారయమియె పూజ్యము
గుమహాచ్చరితమగుఁ॥ (౧౧౯)

క॥ వారలఁగన్గొనహరునకు । దారపరిగ్రహము సేయఁద
మిజనియించెఁ । ధారుణిధర్మక్రియలకు । నారులెకద మూ
లకారణములగుదురొగిఁ॥ (౧౨౦)

క॥ ఘనధర్మకర్మములకుఁ । మినుసిగ వేల్పుమనుగో
రిమచ్చినవేళఁ। మునుతపప్పానర్చి బెగ్గిలు । మనసిజు మది క్రమ్మ
అంగములయందొడంగెఁ॥ (౧౨౧)

క॥ సాంగములగు శ్రుతులనునుడు । వంగలయమ్మునులుగ
గుటపాటు సంగంగా । నంగజహరు నచిఁంచియు । భంగవచః
ప్రౌఢినిట్లుపలికిరిప్రేమోలఁ॥ (౧౨౨)

గీ॥ అస్తదవిరతసర్వవేదాధ్యయనము। మేము చేసినహో
మంబు మేము చేసి । యున్నతపమును గలయంగ నన్నియిప్పు ।
శింఫు నీజఁగఫలియించె నిందుమౌళి॥ (౧౨3)

సీ॥ జగదీశ కానుగో చరముగానిత్వదీ యఘన మానసం
బెక్కఁగలిగెమాకు । నెవ్వనిమదివసియింతు వీవాతండుధన్య
తముండగుఁ దలఁచిచూడ । బ్రహ్మయోనివి నీదు స్వాంతమ్ము
నవసించు వారలమముకన్న వరెమెమఱియు । భానుచంద్రు
లకన్నఁబైనుండి యిపుడు నీ స్మరణంబుచే నుచ్చతర పదంబుఁ।
గాంచితిమినీవు మముసత్కరించుకతన । నలఘు మహిముల
మనిమమ్ముఁదలఁచినార । మాత్మగుణ పుంజమున మహాదాద
రంబు। మించివిస్రంభగరిమఁబుట్టించుఁగాదె॥ (౧౨౪)

క॥ నీమదిఁదలఁచుట వలన । న్సామనములఁ గలిగినట్టిమ
కృవయదినీ । కేమని యెదమఖిలాంత । ర్యామివినీ వెలుఁగ
కుందునదియును గలదే॥ (౧౨౫)

క॥ ప్రత్యక్షముగాఁగంటిమి । సత్యమ్ముగ నిన్నెఱుంగఁజా
లము మాకుఁ । మర్త్యయనమున వసింపవు । మృత్యుంజయనీ
దురూపమెఱిఁగింపఁగ దే॥ (౧౨౬)

క॥ ఏమూర్తిఁ జేసృజించెద । వేమూర్తిఁ భరించుచుందు
వీవిశ్వమునీ । వేమూర్తిఁ హరించెదవది । యామూర్తులలోన నెద్దియగుశితికంఠా॥ (౧౨౭)

క॥ అతితరములు మేమడిగిన । కోరలన్నియు నట్టులుం
డుఁగాకతలఁపనా । గతులమయి యున్న మాకుం । చితముగసె
లవొసఁగు మేమి సేయుదుము హరా॥ (౧౨౮)

వ॥ అనినవిని।

క॥ అంతన్గిరిశుఁడు రాదన । కాంతుల చేమాళిరజని కరత
నుశోభ । న్వింతగఁ బెంచుచు నన్నుతి । మంతులతోఁ బలుకఁ
బూనె మంజులఫణితిఁ॥ (౧౨౯)

క॥ నాకావించు ప్రవృత్తులు । నాకై కావనుచు నెఱిఁగినార
లుమీరల్ । చేకొని యెన్నిదిమూర్తుల । నీకై నడిఁబడుటకోఱ
కు సేవతిఁ యంతుఁ॥ (౧౩౦)

గీ॥ అట్టినన్నుఁ దప్పి నాశ్రమములగు చాత । కములు వానకో
ఱకు పొనముఁబోలె । నరులవలననొచ్చియమరులంబలును దయా।
చించిరాత్మజాతసృష్టికొఱకు॥ (౧౩౧)

క॥ కావునఁ బుత్రోత్పత్తికిఁ, స్థావరవరకన్యఁ గొన్న నెవ్వఁడుగాం
ఛింతుఁడ, బావనుఁ బుట్టింపఁ గమది, భావించెదు యష్ట యద్రిణిప
గది నిజముగాన్॥ (౧౩౨)

క॥ మీరలు నాకో యక్కయ్యయు । న్నారీమణి నడుగుఁడద్రినా
థునిమునుస । తన్నాపవక్త్రతసంబంధము । లారయ నెప్పుడు
నపికారమందఁ బ్రజగతిన్॥ (౧౩౩)

సీ॥ ఉన్నతుండు ప్రతిష్ఠను గొన్నవాఁడు । సర్వసర్వంసహా
చక్రభూధ్రవహుండు । నైనహిమగిరి సంబంధమందు కతన । న
న్ను వంచింతుఁడనుచు మీ రెన్నవలయు॥ (౧౩౪)

క॥ ఎన్నఁగ మీ స్వప్రతిఘీసం । పన్నతె యాచార మనుచుఁబ
ల్కంగ నేనా । కన్నియ నైగంగతిమీ । రన్న గపతి నడుగుఁడను
చు నాడఁగవలెనే॥ (౧౩౫)

క॥ ఈసాధ్వి యరుంధతియును । బాసటయగు మామకీన
పరిణయమునకై । యీసాటి కార్యములఁ గవ । వాసిగనైదువ
లసేర్పు వన్నెకు నెక్కున్॥ (౧౩౬)

సీ॥ ఓషధిప్రస్థమను పేరనొప్పు నతని । పురమునకు నేగిమ
తా కృత్యభరముఁ దీర్పుఁ । డిటను హాకోశినది ప్రవహించుతట
ము । నందు నగుడ సమాగమం బగును మునకు॥ (౧౩౭)

వ॥ అని పలికి॥

క॥ వరయోగివర్యుఁ డీశుఁడు । పరిణయ కౌతుకముఁ దెలు
పఁ బ్రహ్మతనయులా । పరమర్షు లెల్లఁ దమసుం । దరులు వ్రలనిసి
గ్గుఁ బోలఁగఁ దరిమిరి పెలుచన్॥ (౧౩౮)

క॥ మంచిదియీకార్యముఁగా। వించెదమనిమానులద్రిపీ
ఠికి వెడలం। గాంచియటఁదొల్తనుద్దే। శించినతటమునకునేగ
శితికంఠుండున్॥ (౧౩౯)

వ॥ అనంతరంబ మనస్సమాన వేగులగు నమ్మునిపుంగవు
లు వాలుఁజాలుననొప్పు నప్పురంబున కెగసిపోయి॥

సీ॥ ధనములకెల్ల నాస్థానమానలకను వెలికొత్తి కట్టినచె
లువుదాని। స్వర్గాధికజన నిస్సరణంబుఁ గావించి పరుఁగఁ
గల్పించినభంగిదాని। విపులగంగా పరివేష్టిత మగుదానిజ్వ
లితవప్రాంత రోషఘులదానిఁ। బటుతరమాణిక్యవరణంబుదా
నిసం వృతమయ్యు మంజుల ద్యుతులదాని। సింగముల కల్కి
కుండుమాతంగచయము। గుహలఁబుట్టిన గుఱ్ఱము ల్గొఱలు
చుండ। యక్షకింపురుషులు వారు లతులవిపిన। దేవతలెకాం
తసైమించుతీవిదాని॥ (౧౪౦)

సీ॥ కలశాత్తఘనములైకరము విరాజిల్లి తనయిండ్లఁబ్రతి
గర్జితములచేత। సందిగ్ధముల మురజస్వరంబులను బల్తాడ
నంబుల బయల్పఱచు దాని। నాలోలవిటపి సమాలంబివస
నంబులైనకల్పక భూరుహములచేతఁ। బౌరులచేఁజేయఁ బ
డని మందిరదారు కలితకేతన లక్ష్మి గలుగుదాని। స్ఫటికమ
ణినిర్మితానేక చారుహర్మ్య। ములనువెలుఁగొందుపానగో
ష్ఠులను రేయి। నమరు రిక్కలప్రతిఫల నములె చెలఁగు।
నలఘు పుష్పోపహారంబులైనదాని॥ (౧౪౧)

సీ॥ దుర్దినంబులను రాత్రులయందు నోషధికాంతిచే
మాఁగర ప్రకారమెఱుఁగు। నభిసారికలకెల్లనంధకారముఁదె

ల్ప కురుతర సౌఖ్యంబు నొసఁగు దాని। యౌవనాధికవయ స్సమర కుండెడుదాని మరుకంకెఁ స్వైరమిత్రి చొరనిదాని। సురతశ్రమాగత సుప్తికన్నునసంజ్ఞఁ గోలుపోవుటలేక కొఱలుదానిఁ। బొదలు బొమముల్లు పెదవుల కదలుటయును। వ్రేళ్ల జంకెనలునుబూనిస్త్రీలు గనల। వారి కరుణకుమాత్రంబు చేరివేఁడు। కొనెడుగోవాంఛ చేనొప్పుగొన్న దాని॥(౧౭౨)

గీ॥ సరస సంతానతరువర చ్ఛాయఁబండి। యున్న విద్యాధరులు పాంథు లెన్న గంధ। మాదనము పవనమ్ము గా మలయుదాని। నోషధిప్రస్థపురిఁ జేరిరొకటమునులు॥ (౧౭౩)

క॥ వారలు హిమవత్పురిఁగని। ధారుణిలో స్వర్గ సుఖమెడంగోరుట చేఁ। గూరుచు సుకృతంబఁతయు। నారయఁగా విప్రలంభ మనితలఁచిరొగిన్॥ (౧౭౪)

క॥ ఆలేఖ్యాగ్నుల గతిజడ। లోలింగదలక వెలుంగ నున్నఖు లనుచున్। జాలఁగ ద్వాస్థులు చూడఁగ। శైలేంద్రుని యింట డిగిరి చయ్యన వారల్॥ (౧౭౫)

క॥ పెద్దయె మున్నగనమ్మును। లద్దినమున నచటడిగ్గి యంబువు నడుమం। దద్దయుఁజూడం దగియెడు। ప్రొద్దుల చందమునదీప్తిఁ బొలిచి రరుదుగన్॥ . (౧౭౬)

గీ॥ కుధరనాయకుఁ డర్ఘ్యంబుఁ గొనిముదమున। నధికదుర్భర పాదవిన్యాసములను। కుంభినీతల మెల్లనుగ్రుంగఁబడఁగ। వారికాయెడ నెదురేగె దూరసరణి॥ (౧౭౭)

గీ॥ ధాతురక్తా ధరుఁడు దేవదారు భుజుఁడు। నతులపా

ప్రాణ వర్యుండు స్వతుండునగుటు। వరమునులువ్వార లెదలలో
నరసిచూచి। యితఁడు హిమవంతుఁడని నిశ్చయించిరపుడు॥

క॥ అటఁజేసియు చాపమీఁదం। జటినర్యులు గూడుచుం
డ సమయంబునఁ జెం। గటఁగూరు చుండియగ్గిరి। ఘటి
తాంజలియగుచు వారిఁగన్గొనిపలికెన్॥ (౧౪౯)

గీ॥ అర్యులార యుష్మదవ లోకనముమబ్బ। లేనివాన
ప్రాప్తు లేరిపండు। నగుచునేఁడునాకునవితర్కితప్రాప్త। స్వై
నపనుచుఁదోఁచె నబ్బురముగ॥ (౧౫౦)

క॥ మునులార మీయనుగ్రహ। మునవూఘని నన్ను
స్థాన పూర్ణునిగ లెసే। యినుమును బంగరుగలిమే। దినివి
డిదివి నెక్కినట్లు తెలివిందలంతున్॥ (౧౫౧)

క॥ ఇది మొదలూగఁ జేతనముల। ముదమునశుద్ధముల
చేయు పుణ్యుఁడ నైతిన్। బరపడి సంప్రక్షితమగు। నదితీ
ర్థమటంచువిబుధు లాడెదరుగదా॥ (౧౫౨)

క॥ శిరమునయి గంగపడుటను। నరయఁగిరీశాశ్రితభ
వస్పదాంబువుచేతన్। గరుశాత్ర్యులారయిట్టిటిఁ। బరిశుద్ధుఁడ
నైతి నంచు భావింతుమదిన్॥ (౧౫౩)

సీ॥ కోరిబంగరమునుమీ కొలువునందునిక్కని స్థావర మం
ఘ్రిలాంఛనము కలిమి। నుభయరూపముగు నాయొడలువి
భక్త ప్రసాదస్థానవటంచు సంస్మరింతు। నిఖిలదిక్కులయం
దు నిండియుండిన మనఁగములభవత్ప్రాసాగరిచుఁబొడవి।
వ్యాపించు నధికతరానందమున కవకాశమించుక యేనిగ

న్న నదియుక్తమగుఁ । బావనచరాచరంబులు । వావిరి నీ
గర్భమందు వసియించుటచేఁ ॥ (౧౫౯)

క ॥ బలిసద్మము పర్యంతముఁ । బొలుపుగనద్దానినీవు
పూనని యెడఁగుం । డలిపతి బిసమృదు లములగు । పడగ
లచే నెట్లు భూమిభరముందాల్చుఁ ॥ (౧౬౦)

గీ ॥ ధరనవిచ్ఛిన్న విమలసంతానములును । భూరిసాగ
ర భంగానివారితములు । నైననీకీర్తులెల్లఁ బుణ్యమ్ములగుట ।
నమరు భువనములన్ని పూతములుసేయు ॥ (౧౬౧)

క ॥ శౌరిపసంబది యాదిమ । కారణమై యుంట గం
గ ఘనత వహించెఁ । వారకనీవ్రును రెండవ । కారణమై య
లరనట్లె గౌరవముం బెఁ ॥ (౧౬౨)

సీ ॥ అడ్డంబుమీఁదికి నడుగుననంతట వ్యాపించియుంట
చే నంబుజాక్షు । మహిమమప్పు త్రివిక్రమంబయ్యెనది నీకు స
హజమైయున్నది శైలనాథ । యజ్ఞాంశములనందుననిమిషేం
ద్రులలోన నీవు నొక్కండవై నెగడుకతన । హాటకమయని
ర్జరాలయాత్యున్నత శృంగంబురిత్తచేసితివినీవు । స్థావరంబ
గుభవదీయ తనువునందుఁ । బెలుచఁ గాఠిన్యమెల్ల నర్పించి
తిరయ । జంగమాంగమ్ము సాధుపూజాధురీణ । మగుట సద్భ
క్తినమ్రమై నెగడునవని॥ (౧౬౩)

క॥ మాయరుదెంచినకార్యము । నీయదియే యగునుధా
రుణీధరనీకుఁ । శ్రేయము నుపదేశించుట । నీయెడఁ దత్కృ
త్యభాగమెనసిలిమేముఁ ॥ (౧౬౪)

క॥ అణిమాదిసుగుణయుక్తము। బ్రహ్మేతేతరపూరుషాను పాత్తమునగును। గ్గణితేశ్వరశబ్దంబే। గుణియర్థశశాంకుతో డఁగొమరుగఁదాల్చున్॥ (౧౬౫)

క॥ సరణినిగుప్తములరదము। కరణిగ నన్యోన్య సాహ్యక ర్మములగుచున్। బరఁగెడుయదష్టమూర్తులు। భరమగు నీవిశ్వమెల్ల బోగుగఁదాల్చున్॥ (౧౬౬)

క॥ యోగులుదేహాంతఃపద। వీగతుఁగ్రైవెలుఁగునెవనివె తకెదరెపుడున్। బాగగునెవ్వనిసదనము। నాగతసంసారభీతి యందురువిబుధుల్॥ (౧౬౭)

గీ॥ జగముకర్మములకు సాక్షియువరదుఁడా। శివుఁడు పూమొగములఁ జేర్పఁబడిన। ప్రకట వాక్యములను బ్రత్యక్ష ముగనీదు। కూఁతునిప్పుడువేఁడి కొనఁదొడంగె॥ (౧౬౮)

క॥ భారతితో సఖ్యమువలెఁ। గూరుపునీ తనయతోడఁ గూర్మిననతనిస। త్పూరుషున కొసఁగినట్టిది। మారీమణికొ అకుగోడుమలయదుగాదే। (౧౬౯)

క॥ అకుటిలవర్తనుఁడగుమిను। సికదాలుపు తండ్రియ గుటచేతనునిఁకనీ। సకలప్రాణులకునునీ। దుకుమారిక తల్లి యగును దుహినాహార్యా॥ (౧౭౦)

క॥ త్రిదశస్తోమముమున్నఁట। పదిమోముల వేల్పునకును బ్రణతంబగుచున్। బదపడిభవత్తనూజా। పదములరంజించు మౌళిపటుమణిశోభన్॥ (౧౭౧)

స్రగ్విణి॥ పాంహీనారిగా ట్బ ద్ధరాంగాత్తకో। టీరనీరాజ నాటీకనాంచత్సదా। సారచిత్తాంబు సంజాతవిన్యస్తకం। సారికారుణ్యసంక్రాప్తజాంబూనదా॥ (౧౭౩)

గద్యము॥ ఇది శ్రీముకుంద చరణారవింద వందనానందమ
రందతుందిల మానసేందిందిరుండును శ్రీమన్ముద్దుకృష్ణధ
రాపురందర నిరంతర వితీర్ణిత వివిధమణి కనకభూ
షణ సదంబరాలంకార మహాగ్రహారాది సముపభో
గసంజాతప్రమోదసుందరుండును శేషభాషాశేష
సారస్వత శేషశాస్త్రక్రియ వ్యాప్తుండును
బిరుదరాజకులకలశాంభోధి రాకాశశాంక
వేంకటాద్రిరాజపౌత్రుండును జెంగల్వరా
జకవిరాజసుపుత్రుండు నుభయభాషా
భూషణుండును రసికతోషణుండును
సుకవివిధేయుండునగు శేషాద్రినా
మధేయుండు విరచించిన కు
మారసంభవ కావ్యంబున
ద్వితీయాశ్వాసము.

---

శ్రీమదాంధ్ర కుమారసంభవకావ్యంబున
ద్వితీయాశ్వాసము
సమాప్తము.

# శ్రీమదాంధ్ర కుమారసంభవము

## తృతీయాశ్వాసము.

---

క॥ శ్రీరుద్రపద్మజసేవా । ప్రాగల్భ్యధురీణయువతిపంకజబాణా । సాగరగభీరభావా । శ్రీగిర్వాణేశముద్దుకృష్ణమహీశా॥(౧)

వ॥ చిత్తగింపుము నంతరకథాంతంబెట్లనిన॥

క॥ అంతవలశుక్లపక్షము । నందాగిరిసుతలగ్నమగుదినమందున్ । వింతలుగూరిచిగౌరీ । సంతతికివివాహాదికసొంపుగఁ జేసెన్॥ (౨)

సీ॥ ఇంటింటఁ గలకల్వ కంటులు కౌతుక సంవిధానంబుల సంభ్రమింప । గ్రామేంద్రునంతి పురంబునంబురమునననంతటఁ బాండ్లిమయానట్టులుండె । భూరివీధుల నమందారము లైన అయఁ దప్పటములఁబడగలు ప్రబలియుండ । భవన తోరణకాంతి భాసిల్లునప్పురం బన్యస్థల స్వర్గ మననగ నెగడె । బహుళకన యులున్న నుమచిర ప్రాప్తపగిది । గంతుగూని వెండి పుట్టినకరణి గాఁగఁ । జెచ్చెరను బతిభవనంబుఁ జొచ్చునతనఁ । దల్లిదండ్రులకునుజీవితత్వమందె॥ (3)

ఉ॥ పర్వతనాథుబంధువులు పల్లకి సేవనలిచ్చి యంతనా । పార్వతి నంచ ఊరువుల సైని గనుంబుగఁ జేసి ప్రోల్లస । త్సర్వవిభూషణంబుల నొసంగి నిజాత్మజ లంచొకింతయుం । బర్వఁగనీక యాకలికి పైనెసరుంచిరి మించి మోకటన్॥ (౪)

గీ॥ ఉత్తరాతార మిత్ర ముహూర్తమందుఁ । జం

దునని తోడి మోగంబుఁజెందియుండఁ। బేరటాండ్రెల్ల వా
రని గావరమునఁ। బార్వతినలంకరించిరిప్రమదమెసఁగ॥(౫)

సీ॥ అతిశుభ్ర సర్జ పాన్విత మహామృదుల దూర్వాం
కుర సంవర్ధితాతికాంతి। ఘననాభికా తీత కౌశేయ ము
ను బ్రాప్త విశిఖమానభ్యంగ వేషమూని। యానాతి దీక్షా
విధాననారాచంబు తోడిసంపర్కంబుతోడఁజనఫుడు। బహు
శాంతరవికర వర్ధమానంబగు జలజాదికళపోల్కి వెలుఁగు
చుండ। వెలఁదులందఱు లొద్దుగుపిండిచేతఁ। దనువుచము
రెల్లఁబాపి గంధమ్మునలఁది। సారిదిస్నానార్హమైన యంశు
కముఁగట్టి। మజ్జనగృహంబుఁ జేర్చిరమంత భక్తి॥ (౬)

క॥ మకరతమణి తలమునుమహా। కృకరచనమునైన స్నా
నగృహమునఁదూర్వ। ప్రకరము మొరయఁగ గౌరికి। సకియ
లొగిఁ స్నానవిధిని సలిపిరి వేడ్కన్॥ (౭)

సీ॥ మంగళస్నాన శుద్ధాంగి యువిభ్రాజమాన ధౌతాం
బర యైనగౌరి। యతులపర్జన్య జలాభిషేకయు ఫుల్లకాశ
యునగు ధాత్రికరణిఁ జెలఁగె। నాపలమేల్కట్లనమరిరత్నస్తం
భ విలసితంబును న్యస్తశీర్ష మైన। మంజు కౌతుక వేది మధ్యం
బుఁ జేరిచి గతితలు వేడ్కనా గట్టుపట్టి। యందుఁబ్రాఙ్ముఖయై
యుండ నబలకెమటఁ। జేరియుఁబ్రసాధనం బులు చెంతనున్న।
నిర్ధరూపంబు కన్నులనీడ్చుచుండ। నుమనొకక్షణంబు వైసే
యుకుండిరఫుడు॥ (౮)

క॥ ధూపము వేఁడిమిచేఁదడిఁ। బాపిచెలియగౌరికేశపా

శి నునవిరిక । శ్రీపతిమఁ జెరివి గిరికికిఁ । బాగొవగు గుతపుష్ప
మాల బంధించెరహో ॥ (౯)

గీ॥ మృగయుజంబలంది నహిరగోరోచనా । పత్రకములు
వ్రాయ భానుమేను । చంద్రవాకలసితసైకతమైనయొప్పఁ । గాం
చనంగ ధిక్కరించుచుండె ॥ (౧౦)

ఉ॥ అంగనభూషితాలకల నంటినముద్దు మొగంబుఁ డం
బొగి । స్వంగతచంచరీక జలజంబును వారిద రేఖతోడనుఁ ।
బొంగెను చంద్రబింబ ముడివోన హసించి కపీంద్ర పక్షకా ।
భంగతదీయసామ్యకథ ద్రవ్యముఁ జెప్పెరనచ్చపుంజిగిన్ ॥ (౧౧)

వ॥ అంతనన్నారీమణికిఁ గన్నెలంకారంబగు యవాం
కూరంబు శిరోగ్రజస్సంఘర్షణా పరుషంబును గోరోచనా సమ
ఘర్షణా రుణంబునునగు గండమండలంబున వన్నెయు పెంపువ
హించి చూపఱ చూపుం బాదుకొల్పుచుండ సువిభక్తగా
త్రమైన యాగిరిపుత్రి కెమ్మోవి మధ్యగత రేఖతోడం గూడి
మౌనంబున నగణితంబగు తొగరుచాయ నించుక త్యజించి
యాసన్న సౌందర్యఫలంబై యొఱుటం జేసి కొదువలేని డా
లుం దాల్పె మఱియును ॥

క॥ పతితలఁగల చంద్రకళ । ప్రతిదినం బూఁకుమని చర
ణములరాఁగ । ద్యుతిఁగూర్చుఁ జెలిని వచన । స్థితిఁ బార్వతి
ఘూవుదండ చేతన్దెన్ ॥ (౧౨)

గీ॥ కొదవలేనియట్టి కువలయంబులఁ గేరు । చున్నయీ
రి నేత్రయుగముఁ జూచి । చెలులుదానికపుడు జగిఁగూర్చు
ననిమాదు । కడఁగిశుభమటంచుఁ గాటుకిడిరి ॥ (౧౩)

చుఁబడఁ దుంచి నిరుపా । ధృతియు గిరీశా ధారుణిగ । స్థితిఁ బ్రేముఁ బెలి
కొన్నైవారికిఁ జనలెల్లన్॥ (౧౯)

గీ॥ శైలపతి ఘను శ్రీహాసంపదలకు । ననుగుణంబుగఁ గా
ర్యంబు లెన్ని దీర్చి । నెమ్మి బంధువులచోఁ బటుకుండియుండ । గట్టు
విలుకాని రాకకుఁ గాచియుండె॥ (౨౦)

గీ॥ అంతలోఁ బల్లకి లోన మందహాసుని । క్రొత్త పరిణయ
మునకు సురూపమైర । హించు కై సేఁత సుస్తముత్యకలు పేర్మిఁ
దెచ్చి పెట్టిరి యవ్వామదేవు నెదుట॥ (౨౧)

క॥ వారలపైఁ బ్రీతిని నలం । కారమ్ములఁ దాఁకి విడిచి కటకం
మునఁ దొడఁగెఁ । గోరఁగ నప్పటి వేషమె । వారక పరిణీతి కిష్టభావ
మునొందెన్॥ (౨౨)

క॥ పునుక శిరోభూషణము । య్యెను భస్మము గంధమయ్యె
విభవరచన యౌ । బున రోచనంబు ద్రాఁతలఁ । గినిసె నెలంగు
లను బొల్పు ఝామ బయ్యెన్। (౨౩)

క॥ వెగటుగఁ బింగళ నీనిక । మకుశింభ లలాట విలసదంబ
కమపడె । సొగసు మెఱుంగులతోసిం । పగుహరితాళ మయుతి
లకమై విలసిల్లెన్॥ (౨౪)

క॥ తాము నన్న విభూషణములు । గా మెయిఁ దాల్చిన భుజం
గకాయము లెల్లన్ । హేమస్వము నెలకొని యొఘ । మణుల
ట్టులనె యుండె నాఁడు మద్యుతులన్॥ (౨౫)

క॥ పచ్చలైన వెలుంగుచు శై। శవమునఁ గనఁబడని సృష్టి చా

యుగలుగున ట్రైనరాయనిఁ దలఁదాల్చిన । భవునకు శేఖరము
తోడిపని యేమింక౯॥ (౨౭)

గీ॥ వెలయు నీగతి నేష ఘాత్రో వేషమూని । యద్భుతంబుల
కాలయం బైన సతులాలి । గాంచు మెలమిని దెచ్చినకీలోనఁ। దన
దుప్రశోభిబనుసు గనుంగొనఁ యెనప్పుడు॥ (౨౭)

క॥ పగఁగద్వీపితోలుపల్లంబుఛక్తినం । కుచితలైన వృఁగలు
కుగోగాంపతి । నందిబాహువ్రాఁతినందికైలాసఁబు । పగిదినె
క్కెవెస లెభగూఁడఁ దప్పుడు॥ (౨౮)

తరల॥ అతనికిన్వెనువెంటమున్నకలా త్రవాహములెల్లను।
ధ్రతివిగంపిలనేగుచోనవ తింపమున్పలియింపఁగా । ద్యుతిరజో
ఘనసుంజు వెపెను పొందునానన పఙ్క్తినం । చితగతిన్గనలా
కరంబుగఁ జేసిరాకినమునయెడ౯॥ (౨౯)

క॥ అలపొలఁతుల వెంబడి దొ। య్యాలికాళికపాలభూషయ
సుమబలాకా । కలితయయి ముందుమించులు । గలవారిన
క్తిగతిఁబ్రకాశించెరహి౯॥ (30)

గీ॥ భవుని ముందునేగు ప్రముఖులు వాయించు । తూర్యరవ
ముమింటిత్రోవనరిగి । లలితమానశృంగ ములఁబ్రాకియచ్చ
టి। వేలుపులకుఁగొల్వు వేళఁదెలుపు॥ (3౧)

చ॥ ఎనయఁగవిశ్వకర్మ రచియించిననూత్నతరాతపత్ర
ము౯ । వనరుహమిత్రుఁ డెంతయును భక్తిని బట్టఁగదానిక్రిందు
గాఁ । దనరుశిరంబుగల్గు ప్రమథప్రభుఁడప్పుడు మాఁకువీధిపై ।
నసుకుమగాంగ వారిపకునప్పటిలీలవహించెనింపుగ౯॥ (3౨)

వ॥ అంత నాఁ పోతుపొంగి నింగిబంగరుగజ్జెలు సభంగ నినదంబుఁ గావింప మొయిలు గవియుచుంటం జేసి కూలాఘాత వంశస్తకదర్మములు నావిలసిల్లు క్రొమ్ములు సముద్రమ్మున విడి చూడ్కుమఁ దనపై నెక్కియున్న ముక్కంటి వెక్కసుబత్తి నొంచి వహించుకొను నిసారజ్ఞవులచేఁ బొలెంబుర్సంక్రాంతి గిరీశ వీణాప్రప్రపారిస్ఫుటాంచే నాకృష్యమాణంబై యున్నఁ డేనిపగ అకు నర్గంబు గాఁ గొన్న గవనిరంబు వేగిరంబ ప్రవేశించిన॥

క॥ పొరులుకుసుమకోసుఖులై । వారకనుగొనఁగ శూలపా
ణినిజసుహా । నాగాచలాం ఘనంబను । తారాపథ మార్గణము
ననుధరణికిడిగె యెడ॥ (౮౦)

గీ॥ హరుని రాకకెరి యద్రిభూషిత బాధు । పరుం మో
యుచున్న రుతోడ । పికిచతురుపైన స్వాటకమ్ములతోడఁ ।
లొలెసదుగాఁగఁబోయెనంత॥ (౮౧)

క॥ సురసంసములుదైవ । స్వరఘోషములగుచునగరి
ద్వారము । ల్వానిమూడ్పిట్టఁ గ్రైంచిన । గురుసలిలాఘ
ములభడికొననొగెఁ॥ (౮౨)

గీ॥ బాలుజగంబులకును వందుఁ డీశుఁ డనఁ । జేసినంత
సిగ్గుఁ జెందెనద్ది । యుగసివహించు చెలి నాత్మశీర్షముమున్నె ।
వంగియుంటమవి నీలాంగఁ డయ్యె॥ (౮౩)

క॥ ఆల్లునిఁ దేశుచు మొగ । ముల్లసిలన్ద్వపణివీధినుజ్జ్వ
లసుమములఁ । పెల్లుగఁ గురియఁగ నగ్గిరి । వల్లభుఁడపుడతనిఁ ద
నసాభవనముఁ జేర్చెఁ॥ (౮౪)

గీ॥ అప్పుడమగు దెంచు హరుని సందర్శించుటకు । దలచిపీటనున్న తలిరుబోడి । పనుల నెల్లమాని ప్రాణనాథపఙ్క్తి నీ । గతి వసించి రధిక కౌతుకమున॥ (౮౫)

(ఉ) ఆయెడ నొక్క కామిని రయమున నమ్మహనీయు జూడవా । తాయనమూ [illegible] జనగ నప్పుడు కొప్పు వీడి మాల్యము । ల్వాయుచునున్న పెన్నెఱులు బొఙ్గిని బట్టియుఁ జూచునతకుర్ । గాయము చెమ్మరింప నది గట్టగ సెంచదు నెమ్మనమ్మునన్॥ (౮౬)

చ॥ లలన యొక్క తె ధరాగ్రమగు లత్తుకఁ బూయఁగ నగ్రపాదము । న్వలిమిఁ గడ్చి యొక్క మద నాగమనో హరయాన తద్దగా । సిలు మను మంజు యానముఁద్యజించి గవాక్షముదాఁక మాగను । గలయన లక్తకాంకితముఁ గానొసరించెను మించు వేడుకన్॥ (౮౭)

క॥ కుడికంటఁగాటుకిడి యొక । పడఁతి యెడమకంటనిడక భవ్య విలోకన్ । గడువడిఁ జేతంగొనియ । వ్యేడజాల సమీపమునకు నేగెనరుదుగన్॥ (౮౮)

క॥ చనియొక్క తె జాలముపద । వినిజూచుచు వెడలునపుడు వీడిననీవి । న్గనినాభీగత భూషణ । ఘనరుచి యగు తనదు చేతఁగైకొని నిల్చెన్॥ (౮౯)

సీ॥ సగము మణుల్నించి సంభ్రమంబున లేచియడుగులు తడఁబడ నరుగ రశన । యప్పుడు మాటికి జాఱ నంగుష్ఠమూల పమరికా తసూత్రమై యరిగెనొకతె । బహులోలలోచన భ్రమరపఙ్క్తులుగల్గు తత్సతీరమ్య వక్త్రములచేత । వ్యా

గీ॥ శౌరికై దండయొసఁగంగ శారదాభ్రి। మినుకుఁబోలె
నుహరుఁడల్లవృషముడిగ్గి । యజుఁడుతనముందునేగంగనద్రిరా
జ । సుభగకక్ష్యాంతరమ్ములఁ జొచ్చెనపుడు॥ (౫౫)

క॥ ఆరంభమునర్ఘంబుల । తీరునశివునింద్రముఖ్య దివిజు
లుప్రమథు । ల్వారకసప్తర్షులుముద । మారననుసరించియే
గిరద్రిగృహంబున్॥ (౫౬)

చ॥ హరుఁడు నికేతనంబున మహాసనమందు పవిష్టుఁడైన
చో । నరుదుగరత్నయుక్తమగు నర్ఘ్యముసన్మధుపర్కము
న్నవాం । బరములుదెచ్చియిచ్చెగిరి వర్యుఁడతండవి యెల్లనా
యెడన్ । స్థిరతర మంత్రయుక్తముగఁ జేకొనియెన్నను కౌతు
కంబునన్॥ (౫౭)

చ॥ ప్రకటితఫేనుఁడైతగునపాంపతిఁజంద్రకరంబు లెల్లనై ।
చ్ఛికముగ వేలడగ్గఱకుఁ జేర్చెడు రీతి దుకూల ధారియా।
సకల చరాచరేశ్వరుని శంకరుఁగంచుకి శేఖరుల్విధూ । నికట
మునందుఁజేర్చిరిమ నీషిజనంబులుసన్నుతింపఁగన్॥ (౫౮)

సీ॥ వీఁకశరత్తునులోకంబుపోలె నేధితముఖచంద్ర మోదీ
ప్తియైన । యుమఁగూడి వికచ నేత్రోత్పలుండుఁబ్రసన్నచిత్త
పానీయుఁడై చెలఁగెనీశుఁ। డొండొరుఁజేరుచునుండఁజకితము
లునించుకనిల్పిహరించినవియు । సారెఁబరస్పరాసక్తములగు
కను ల్త్రపచేత సంకుచితంబు లయ్యెఁ గీ॥ దనకుజెగ్గిలి పా
ర్వతీ తనువునందు । గుప్తుఁడైయున్న మారు నంకురము[illegible]గ।
నరుణిశాంగుళియగునుమాకరముశివుఁడు । గోత్రగురుఁడంది
యియ్యఁగైకొనియె నెలమి॥ (౫౯)

క ॥ పులకలు జనించెనుమకం । గుళులొగిఁజెమరించె
హరునకు నపుడు తద్దే । వులకుంబాణిస్పర్శనమె । వడిమా
న్మథ వృత్తిసరిగఁ బంచెననంగన్ ॥ (౬౦)

క ॥ రంగుగ భువిదంపతులక । భంగశ్రీనొసఁగుశివయు
భగుణఁడు వారే । పొంగికవయఁదద్ద్యుతినెం । చంగం దర
మాని పెండ్లిసమయము నందున్ ॥ (౬౧)

క ॥ అమ్మిథునముజ్వలితాగ్నిన । యమ్మునవలగొనుచుఁ
జెలఁగె నామరగిరిప్రాం । తమ్మునవోలిగఁగలసిభ్ర । శమ్ముగ
వెలిఁగెడు నహర్నిశమ్ముపగిదిగన్ ॥ (౬౨)

ఉ ॥ ఒండొరుఁ దాఁకి కన్గలువ లొయ్యనమూసిన వా
రిచేతఁద । న్మండపమందు నగ్నికిఁ బ్రదక్షిణము న్సలిపించియుం
దునా । యండజయానచేత జ్వలదగ్ని ముఖంబున శాస్త్ర
పద్ధతి । న్వొండియులాజ లఘ్ఢు విడిపింపఁగఁజేసెఁ బురోహి
తుండొగిన్ ॥ (౬౩)

గీ ॥ భామసురభిలాజ ధూమమాస్యము నందుఁ । జేర్చె
గురువు నాజ్ఞఁజేసి యదియె । గండమందుఁబర్వి కాంతకు
నిముసంబు । కర్ణ కువలయంబుగాఁజెలంగె ॥ (౬౪)

సీ ॥ భామమోమాచార ధూమంబుఁగొనికించిదాఁద్రాణ
పుణ కపోల మల్పపీత । రమ్యనీలాంజన రంజనాంబకమును
సాధుయవాం కుర శ్రవణమయ్యె । నపుడు పురోహితుఁడ
బలనీ పెండిలి కియ్యగ్నిసాక్షియౌ నింకనీవు । చింతలన్నియు
మాని శివునితోడంగూడి ధర్మము సలుపంగఁదగునటన్న ।
వీనులదృగంత ములఁదాఁకవిస్తరించి । తనర నూష్మాగమో

త్కట తాపమైన । యవని మొదలను మఘవతోయమును
భోలె । గురునివచనముఁదగఁ గ్రోలె గిరికుమారి ॥ (౬౫)

క ॥ ధ్రువుఁడగుఁ బతిధ్రువుఁ జూడుము । నవలా యని
పల్కసిగ్గు నప్పినగళా । రవమైకడు జతనంబున । నవనత
ముఖ మెత్తి కంటి ననివాక్రుచ్చెన్ ॥ (౬౬)

క ॥ ఈకరణిఁ బురోహితుఁడొగి । శ్రీకరముగఁ దమకుఁ
బెండ్లి చేసినచోనా । లోకము తలిదండ్రులు భా । షాకరు
నకుఁ దాత కెఱఁగి రంచితభక్తిన్ ॥ (౬౭)

గీ ॥ తరుణిభువనైక వీరుఁడౌ తనయుఁగనుమ । టంచు
గౌరిని దీవించియష్టమూర్తిన్ । నేమిదీవింతునంచు వాగీశుఁ
డయ్యు । సారసభవుండు చింతచేనూరకుండె ॥ (౬౮)

శా ॥ అంతన్సంతస మారవారలురు పుష్పాలంకృతం
బై మహా । కాంతంబైన వితర్దిమీఁదను లసద్గాంగేయ పీఠ
స్థులై । పంతంబారఁగలౌకికంబిది కడున్బ్రాభవ్యంబు సుమ్మం
చున । త్యంతేచ్ఛన్ దలఁబ్రాలు వోసికొని రార్య గ్రామ
ణులెల్లలన్ ॥ (౬౯)

మ॥ విలసన్మంజుదళాంతసంగతపయో బిందుప్రకాండం
బుచే । వలదత్యుత్తమభూరి మౌక్తికకలాపశ్రీకమైచాలభా।
సిలుచున్నిస్తులజాలదండమగురా జీవాతపత్రంబువా । రలకు
న్బట్టెరమావధూమణియద భ్రిచ్ఛాయలేపారఁగన్ ॥ (౭౦)

క ॥ భారతివరేణ్యుఁడగువరు । వారకసంస్కృతము చేత

వధువై తగునా । గౌరిని బ్రాకృతభావన । పారముగ నుతించె
నతులవాక్యప్రౌఢిన్ ॥ (౭౧)

గీ ॥ వరముఖాదికసంధులం బ్రకటవృత్తి । రమ్యనవరసని
యమితరాగమునుమ । హాప్సరోజన మధురాంగహారమైన ।
నాటకముం గాంచిరొక్క క్షణంబువారు ॥ (౭౨)

పంచచామరము ॥ ప్రయోగమద్ది చూచు నాత్త భార్య
నల్ల శంకరు । న్ప్రియంబుగాజొహారొనర్చి వేల్పులెల్ల మారుని ।
ద్దయ న్రయంబశాపపుందు దన్ శరీరయుక్తుం జే । సియింక మీఁద
వానిసేవస్వీకరింపవేయనన్ ॥ (౭౩)

మ ॥ వినికోపంబుం ద్యజించిమించి హరుండా వేళ న్మనో
జాస్త్రము । ల్తనయందుంబడం గోరియొప్పికొనె యుక్తంబేయ
గున్నేముషీ । ఘనులున్గార్యమెఱుంగువారు తగవౌ కాలంబు
నం జేయు న్ప్రా । ర్థనబల్మిక్కముగాంగ సత్ప్రభులయొ ద్దన్వే
ఫలించున్గదా ॥ (౭౪)

ఉ ॥ అంతటశంకరుండు త్రిదశావళికానతియిచ్చిపార్వతీ ।
కాంతకరంబుంబట్టికొని కాంచనకుంభములుంచిపూవుల । న్సం
తనం బెట్టిధాత్రిపయి శయ్యయొనర్చిన కేళికాగృహా । భ్యంతర
రమందుం జేరెనుమహా ముదమందుచునద్భుతంబుగన్ ॥ (౭౫)

చ ॥ అలరసవోఢయౌటం ద్రప నందితదున్న మితాస్యబింబ
ము । న్బలిమిం దిరోగతంబుగనొనర్చుచునెప్పుడు తోంబరుండు
నె । చ్చెలులకనుత్తరంబుం గదుసేగినొసంగెడి గౌరిం బ్రామ
తో । చ్చలముఖ వైకృతంబు లంగ పడిన్ రహిన్ నగుపించెన
య్యెడన్ ॥ (౭౬)

గీ॥ పరిణయంబువెనుకఁ బార్వతీశునిఁ గుఱిఁ జికిలిగినట్టికూ
టమివెలి । కతనశంకరునకుఁ గామదోహదమైన । సుఖము సం
భవించె సొంపుమీఱ॥ (౭౭)

క॥ అడిగినదానికినుత్తర । మిడక వలువఁ బట్టనేగ నెంచు
చు సజ్జ । న్బెడ మొగముగ నుండియునా । మృడునకు గిరి తన
య సౌఖ్యమిచ్చె న్దొలుతఱి। (౭౮)

క॥ ఇది యేమి సేయునోచూ । చెదనని నగుచూరకుండె
శితికంఠుండా । మదవతియు నభిముఖాంబక । మదినూసికొ
నెఱ తృణప్రభాహతము [illegible] (౭౯)

గీ॥ పోఁకముడిసడల్పఁ బోకిఁటనుంచిన । హరుకరంబు వ
డఁకుచాఁ గగౌరి । నైయునవ్వడే తనంతనముడివీడి । వలువజా
ఱెన్నల్లజలజముఖికి॥ (౮౦)

క॥ చెలియరో మంతనమునహారు। నలుకక సేవింపుమను
చునాళీజనము । ల్వాలికినదంతయుఁ బతిముం। గలనుండఁగ వెలి
చియద్రికన్యకమఱచెఁ॥ (౮౧)

క॥ సల్లాపము నకవిషయము । తెల్లన్వాచియించు నీశునీ
క్షింపుచుఁ ద । ద్వల్లభ వాగ్రూపోత్తర । మొల్లక తలయూఁపు
చేతనుత్తరము సఁగెఁ। (౮౨)

గీ॥ అంబరముహరింప నాత్మకరంబుల । హరుని కన్ను
దోయినావరించి । శూలినుదుటికన్ను సూడయత్నము సెడు।
కొత్తఁగియూరకుండె నిందువదన॥ (౮౩)

సీ॥ ముద్దిడమోవీక మొనసియాలింగింపఁ గరయుగమొ

క్కింతకదలనీక । ప్రతికృతిలేక లజ్జితయైనఁదద్వధూ రతమును మహాళికిహితమయ్యెఁ । బెదవికాటులులేని వదనచుంబనమును వ్రణచిహ్నములుగానిరదనఖములు । గలిగినహరకృపా విలసితరతిదక్షి నన్యరతంబు లేదయ్యెనుమకు । వేఁకువనులేచియారాత్రివృత్తమెల్లఁ । జెప్పుమనివేఁడుచెలులకా శివునిరాణి । సిగ్గుపెంపుననద్దానిఁజెప్పకుండు । స్వాంతమున నదివచింపఁగసంభ్రమించు॥ (౮౪)

చ॥ అనుపమగాత్రియాహిమవదాత్మజముద్దుగనద్దమూని పె । ల్చనరజనీ ప్రవృత్తనిజ సంగమచిహ్నము లారయంగనా । వెనుక వసించు శంకరుని బింబమదచ్చట నాత్మబింబముఁ । వెనుకొనియుండఁగాంచిసలి పెన్వలుచేష్టల నానపెంపునన్ ॥ (౮౫)

గీ॥ విషమనేత్రుఁడనుభవించిన పరువంబు । గలుగఁకూతుఁజూచియలరె మేన । ధవుని పేమిఁ గాక ల్లిఁదల్లిమానసదుఃఖ । మెల్లఁబోనడంతు రింతులెందు॥ (౮౬)

క॥ కొన్ని దినంబులుహరుఁడా । యన్నను జతనమున నేల నావలఁదగనా । కన్నియయునల్లనల్లన । మున్నుండినప్రాతికూల్యమున్ దృజియించెన్॥ (౮౭)

క॥ పతిఁగౌఁగిలించుఁగదిసిన । ధృతిఁజుంబింపంగ మొగముఁద్రిప్పక యుండున్ । భృతమేఖల సడలించెడు । నతనికరమ్మడ్డగించునార్యయలసతన్॥ (౮౮)

క॥ కృతచేష్టాజ్ఞేయమునప । గతవిప్రియ మాత్తసూక్తిత

ణవిరహార్తము । త్థితభీతియునై వారికి । రతిపాదమెను గొన్ని వాసరంబులలోనన్॥ (౮౯)

క॥ అనురూపుఁడైనవరుఁగని। యనురాగముఁ జెందెగౌరి యతఁడునటయ్యెన్ । ఘనగంగయబ్ధివిడదా । యనతన్ముఖ రససమెప్రీతినానుంగాదే। (౯౦)

క॥ సురతమునుపదేశించెడు । హరునకు హైమవతి శిష్యురాలైయొగిఁద । ద్గురునకు నానిధు వనమే । గురుదక్షిణఁజేసి యతనికూరిమిఁగొనియెన్॥ (౯౧)

గీ॥ కొత్తికివిడిచిన తనదువా తెలుకుగౌరి । వ్యథితయైవిధు తాత్త్రీయహస్తయగుచు । శీతలంబగుతత్ప్రియ శీర్షచంద్ర। రేఖచేతనుక్షణమునిర్వృతియొనర్చె॥ (౯౨)

క॥ అలకలచూర్ణమురాలినఁ । గలుషంబగు నుమటికన్నుగామారిస్ఫుర । జ్జలరుహపరిమళఫూత్కృతిఁ । బొలతిరోయూఁదుమరిగౌరి ముఖమునఁ జేర్చెన్॥ (౯౩)

క॥ ఈవిధమునస్త్రీసంగముఁ । గావింపుచుమరునిమఱలఁ గల్పించియుగా। రీవనితతోడశీతన । గావాసమునందుమాస మాహరుఁడుండెన్॥ (౯౪)

క॥ తనయావిరహమునన్గో । డెనసినగిరిరాజునాజ్ఞనిచ్ఛాగమన । ప్రణుతోక్షమునెక్కి విదిధ । జనపదములశంకరుండు చనివిహరించెన్॥ (౯౫)

సీ॥ పవనవేగోక్షంబు పైనుమాకుచపుర సక్తుఁడైసు మేరుపర్వతముఁజేరి । తపనీయకిసలయ తల్పయానారాత్రిన

నుభవించెహిమాద్రితనయఁగూడి । రమణీముఖాంబుజభ్రమ
రమైహరికట కాంకితా శ్మంబులు నతివినూత్న । పీయూషబిం
దుసంభృతములౌమందర కటకమ్ములందునాదటవసించి । రా
వణ క్ష్వేడకోడిశివావధూటి । కడఁగితనయంతఁ గంఠఁబుగాఁ
గిలింప । నలరిమడికాసుగట్టుపై నష్టమూర్తి । యమలతర
మగు రేయొండననుభవించె॥ (౯౬)

మ॥ ఒకనాఁడామలయాచలంబునను భావోన్మేష మేపార
ద । ర్పకయుద్ధార్దితరైయు వసించునెడఁ దాపంబెల్లఁ బోఁద్రో
చెఁ దం । డికకున్సత్ప్రియవాదిపోలెధుత పాటీరాగ్ర శాఖంబు
సౌ । ఖ్యకృదామోద లవంగ కేసరమవా గాయాతవాతం
బొగిన్॥ (౯౭)

గీ॥ హాటకపుఁదమ్మిహరు మోఁది యతఁడుపిదప। దోయిట
నునీరుసల్లఁగన్దోయిమూసి । విశదమీనాళిపునరు క్తరశనయగు
చు । నింగిగంగనుబ్రుంగెనా మంగళాంగి॥ (౯౮)

క॥ ఇమ్ములఁబౌలోమ్యలకా । హర్మ్ముల్మందారములను
హరుఁడింద్రువనిన్ । గొమ్మను గైసేయుచునుజి । రమ్ముగఁజూ
డఁబడెదేవరమణులచేతన్॥ (౯౯)

క ॥ ఇటులన పార్థివభామో । త్కటసుఖముల ననుభ
వించి కామినితోడన్ । జటులతర సంధ్యవోడమగ । నట
వెల్వడి గంధమాదనాద్రికి నేగెన్ ॥ (౧౦౦)

క । బంగరుశిలలందుండిక । నంగన్ దగు సూర్యుఁజూ

చి నలి వామభుజం । బుం గ్రహియించిన తనత । న్వంగికి ని
ట్లనియె నీశుఁడయ్యద్రిపయిన్ ॥ (౧౦౧)

గీ॥ అబ్జముల శోభలోహితోపాంతతావ । కేశుణమ్ము
లఁ జేరిచి యేమొయినుఁడు । ప్రళయకాలంబు ననుబ్రజాప
తి జగంబు । భంగి దివసంబుసంహరింపంగఁ దొడఁగె ॥ ()

క॥ ప్రాలినభానుఁడునిజకర । జాలముతో శీకరముల స
మయింపఁగనో । బాల భవత్ప్రిత్ర్య ఝురముల । లీలా హరి
చాపపరిధి లేదది గనుమీ ॥ (౧౦౩)

సీ॥ అబ్జకింజల్క మయ్యది గొతికివిడిచి గళముల నొం
డొంటిఁ గాంచఁద్రిప్పి । కొలనిలోవా పోవు కోకంబులకు నవ
కాళమించుకయయ్యుఘనమయయ్యెఁ । బవటిచో బెడఁబాసి
వారణపజ్జులు సల్లకీపల్లవసౌరభంబు । నరవిందబద్ధాళియగు
నీరమాప్రభాత మ్మైన తిండికిఁదగఁగఁద్రావె । నబలచూడుము
ప్రత్యగాశాంతభాగ। లంబితపనుండునిడుదబింబంబుచేతఁ। గొ
లనిలోపలి పానీయములకుఁబసిడి । కట్టఁ గట్టినో నానొప్ప
గాంచెనిపుడు ॥ (౧౦౪)

క॥ పడియలఁగోఅలపందులు । పడియెండం గడపిథవ
ళవక్రబిసములన్ । వడి గొఱుకుచున్నవనవె। ల్వడిపాఱెడిని
పుడుకనుము వానిమృగాక్షి॥ (౧౦౫)

గీ॥ జాఘువారసంబుఁ బోలెడు ఫురిగల్గు । నెమ్మియొకట
క్రూనికొమ్మనెక్కి । వనితసమయుచున్న మునిమాపుటెండ
ను । గ్రోలుచున్న లీలఁగ్రాలెఁగనుము॥ (౧౦౬)

క ॥ తొలిదెసఁ జీఁకటిగవియుచు । నలరఁగనొకవంకపం
క మబ్బినయటులై । జలజాప్తుఁడా తపాంబులఁ । బొలియిం
పఁగ నివురు సరసిపోల్కి-డి. విదగెఁ ॥ (౧౦౭)

గీ ॥ మృగము లుటజాంగణంబుల మెఱయుచుండ । మొ
దలు తడసిన బాలాగములు చెలంగ । నగ్గికయి యున్న మొ
దవులునరుగు దేర । నగ్ను లుజ్వలింప నిపు డాశ్రమాళి వె
లసె॥ (౧౦౮)

క ॥ ముకుళిత మయ్యును గమలము । నికిఁ గోరిచరించు
నళికి నెనరునఁజోటుఁ । బ్రకటముగనిచ్చుకై వడి। నొకకళను
హరావశేష మొనరిచెఁగనుమీ ॥ (౧౦౯)

ఉ ॥ వారిజ పత్రనేత్ర యదె వావిరిఁ గ్రుంకుట నల్పరశ్మి
యై। సారత రారుణద్యుతి భృశమ్ముగ నిమ్నగు ప్రొద్దు చేతనా।
వారుణ దిక్కు-కేసర విభాసురము న్గడుశోణమైనశ్రీం । గార
పు బంధు జీవతిలకంబున మించిన బాలఁ బోలెడిఁ ॥ (౧౧౦)

గీ ॥ తోడఁదిరుగుచుఁ గరములేత్రోలు మునులు । రథ
తురంగములకుఁజిత్తరంజనముగఁ । దేజమగ్గిని జేర్చి-నదివ
సకరుని । సామముల సన్నుతింపఁగ సాగిరిపుడు ॥(౧౧౧)

సీ ॥ దివసమంబుధినుంచి యవనతముఖములుఁ గర్ణ-ప్ర
కీర్ణ-క ఘుట్టితాక్ష । ములుయుగ సక్తనిస్తులకేసరములగు
ఘోటకమ్ములతోడఁగ్రుంకె భానుఁ । డతఁడస్తమింపని ద్రి
తమనఁదగెనింగి ఘనతేజమునకిదే గతియగునది । పుట్టిదే
నికివన్నెఁ బెట్టు నాచోటికిఁ జెడుచు సంకోచంబుసేయుచుం

డు । నస్తగిరి శృంగమందున్న యర్కుఁ డేని । ననుగమిం
చెడి నీసంజవనితకనుము ; యిదియుదయవేళలోఁబురస్కృ
తినిజెంది । యిడుమతఁడి వెంటఁగూడక యెట్టులుండు॥(౧౧౨)

క ॥ నీవీక్షించెద వనినా । నావర్ణాంభోదముల కొ
నల్దగనీసం । ధ్యావేళవతీకలనీ । తేవన్నిది నటు దోఁచెడి
న్నాకతివా ॥ (౧౧౩)

క ॥ సింగముల సటలఁగిసలయ । మంగళ వృక్షముల
ధాతుమత్కూటముల । న్బొంగుమునిమాపు టెండక్రొ । శాం
గిరొ చరమాద్రిపంచెనన నొప్పారెఁ ॥ (౧౧౪)

గీ ॥ మించిపాదాగ్రము లెభూమిమీఁదమోపి ; యమల
సలిలంబుచేత నర్ఘ్యంబులిచ్చి । యలరి సంజకు నెదుట గా
యత్రిమంత్ర । మిపుడుజపియించుచున్న వారెల్ల మునులు ॥

క ॥ కావుననే సంధ్యావిధిఁ । గావింపఁగనాన తిమ్ము క
లికివినోద । ప్రావీణ్యముగల చెలులు క । థావైఖరిఁబ్రొ
ద్దుపుచ్చ దరునీకనిన్ ॥ (౧౧౬)

క ॥ హృదయేశ్వరు పల్కినకు । న్మదినొప్పక శైలగా
ట్కుమారికయపుడే । పెదవివిఱిచి తనసంగడి । సుదతియ
యినవిజయతోడసుద్దులకొగ్గెన్ ॥ (౧౧౭)

క ॥ అతఁడునుసాయంకాలో । చితవిధిమంత్రములతో
డఁజేసియసూయా । న్వితయై పల్కినిగిరివర । సుతకడక
రుదెంచి నవ్వుచున్ వాక్రుచ్చెన్ ॥ (౧౧౮)

క॥ దులుపుముకోపమ కారణ । మలుకేటికిసంధ్య కె
ఱఁగనరిగితినీతో । లలిధర్మము సలిపెడిన । న్నలకోక
సమాన వృత్తుఁడనియెఱుఁగుమదిన్ ॥ (౧౧౯)

క॥ మున్నగ్నిష్వాత్తాదులఁ । బన్నుగఁగల్పించితనువుఁ
బాసినజుఁడదీ । చెన్నున నుదయాస్తంబులఁ । గ్రన్ననఁ బూ
జ్యమగునాకుగౌరవమెసఁగన్ ॥ (౧౨౦)

క॥ చీఁకటిబాధింపఁగభువిఁ । దాఁకినిలిచెననఁగసంధ్యతన
రెనొకదరిన్ । జీఁకటి ప్రమాఁకులుగలయం । బ్రాఁకినధాతురస
నదినిబలెగనుదానిన్ ॥ (౧౨౧)

సీ॥ సంగరభూస్థలి క్షతజంబు తోడన ద్దంబువై చినయ
డిదంబుఁబోలెఁ । బడమరశోణిమ ప్రాప్తమైక్రుంకంగ నెఱ్ఱ
డౌమునిమావు లెండఁబూనె । శర్వరీవాసర సంధితేజము
మేరు మహీధరనాయకు మఱుఁగుసేర । నీకారుచీఁకటియెల్ల
దిక్కులనన గర్భముగాఁగవిసెడిఁ గలువకంటి । క్రిందమీఁద
నఁబ్రక్కలముందువెనుక । నురకవీక్షణగతిలేక యుండనిరులు।
మావిగ్రమ్మఁగ గర్భంబులోవసించు । చున్నదననొప్పె నీజ
గంబున్నుమిన్న॥ (౧౨౨)

క॥ అమలముమలినముస్థావర । మమరఁగ జంగమముభు
గ్నమాజాతవయుతమున్ । సమమొనరిచెఁ జీఁకటిభే । దముఁ
బాపెడుచెడుగువృద్ధిఁదలఁపందగునే॥ (౧౨౩)

క॥ నిక్కమ్మిరులడఁగింపఁగఁ । జుక్కలదోరవాడమునిపు
డుచూడుము పెలుచన్ । జిక్కనిగేదఁగిపుష్పాడి । నెక్కొనెన
నఁదూర్పుమొగము నెగడెన్నగువా॥ (౧౨౪)

గీ॥ తారలొప్పారమందరాంతరితుఁడైన । చందురునిచే
తనీరేయిసఖులుగొల్వఁ । బల్కులాలింపఁగావెన్క భాగమం
దు।నున్ననాచేతనీవలెవన్నెఁగొనియె॥ (౧౨౫)

తరల॥ దివసమేగెడిదాఁకనేరికిఁ దెల్పకూరకయుండితా।
నవలరేపురి కొల్పవెన్నెల యస్దర స్మితమల్లనన్ । బ్రవిమలంబ
యిమున్నుపర్వఁగఁ బ్రాచియైందవబింబము । స్త్రవనయోగ్య
రహాస్యమున్విదితంబుగాఁ బ్రకటించెడిన్॥ (౧౨౬)

క॥ దివినిసరస్సలిలమునం । దువెలయు బింబములుగల్గు
తొవరాయఁడు వే । కవఁబాసిదూరమగుజ । క్కవమిథునము
ననుకరించెఁగామినికనుమీ। (౧౨౭)

క॥ నవముగఁబొడమియవాంకుర । నివహమ్ముంబోలుచం
ద్రునికరవ్రజమీ । నవతంసమ్మునకైమా । దన వయుతనఖ ము
లనుగోయఁ దగునగతనయా॥ (౧౨౮)

గీ॥ అంగుళులచేసిరోజచయంబుఁబోలెఁ । గ్రమకరముల
చేతఁజీఁకటిగ్రహించి । ముకుళితాంభోజ నయనమై పొదలురే
యి । మొగముముద్దాడుననననొప్పెఁ దొగలతేఁడు॥ (౧౨౯)

క॥ పెఱిగెడుచంద్రకరంబుల । నఱిపోయిన తమముగల్గు
నాకముకరిరా । జెఱిగొనికలంపఁగాఁగ్ర । మ్మఱఁదేఱెడికొలని
పసిడిమలసెంగలికి॥ (౧౩౦)

గీ॥ రక్తతఁద్యజించియాతొవరాయఁడిప్పు । డధికతరశుద్ధ
మండలుండయ్యెఁదరుణి । కాలదోషజమైనవికారములు । ప్ర
కృతులందుఁదిరంబుగాఁబాదుకొనునె॥ (౧౩౧)

క॥ ఉన్నతములవి ధురుచియై । తన్నిమ్నములందు రాత్రి తమము వసించెన్ । మున్నె సదసత్త్వలకుఁ ద । త్సన్నిభ గతిఁ గూర్చె నజుఁడు తామరసాక్షీ॥ (౧౩౨)

క॥ ఉడుపతికరములఁ బొడమిని । బిడమగు శశికాంతనివహ బిందుల చేతన్ । వడి నడిమి తరుల నిద్రిం । చెడి నెమ్ముల మేలుకొల్పె శిఖరియిది సతీ॥ (౧౩౩)

క॥ కలికిరొ కల్పక శిఖల । న్వ్రాలి గదునంశువుల చేత విధుఁ డిప్పుడుత । లలితమణిహారతతుల । న్గలయఁగ గణియించు మూఁడికొనొప్పారెన్॥ (౧౩౪)

సీ॥ ఉన్నతగభీర దేశంబులుండుట తన । నిండుచీఁకటితోడ నీయెండ యామ । టేనికకుఁ బ్రక్క భంగులు గాన మర్చి । యున్నభసితంబు గతిఁ దోఁచునిన్నగమున॥ (౧౩౫)

క॥ ఉడుగక డప్పిని గైరవ । ముడుపతి భారసముఁ గ్రోలి దొరాకొనగా । నపరవముతోడఁ గడువడిఁ । దొడి మెమొులటిపాఁకఁబగులఁ దొడఁగె న్గనుమీ॥ (౧౩౬)

సీ॥ మానినియీయాఁగి ప్రమానికొమ్మల వ్రేలు దువ్వల్వ వెన్నెల దొడర సంశ । యితరూపమయ్యె మారుతమిప్పు వీవంగఁ దనరూపుఁ దెల్పెడిఁ గనుము చెట్లు । క్రిందరాలిన పూలచందాన మ్రావులై పత్రాంతరములఁ జూపట్టునట్టి । చేయెండ తున్కల నీయంగుళుల చేత గ్రహియించి కొమ్ముడిఁ గట్టనగును ॥ గ్రొత్త పెండిలియై వెలుఁగొనివడంకు కన్యతోడను దద్వరు కరణిఁ గాఁగఁ । దరళమండలయగు నిత్యతారతోడఁ । గూడుచున్నాఁడు రేఁడేఁడు నేఁడుమింట॥ (౧౩౭)

టయూరకనగవు ।న్గొన్నయుమమోముఁబతి వేఁ।డ్కన్నెత్తి మొ
గమువనకాదుకన్నులఁద్రోలెన్ ॥ (౧౪౩)

క॥ బంగరుమేఖలజాఱఁగ । రంగగుతనపీనకటి భరంబో
ర్వనియా । యంగనధ్యానభవంబగు । మంగళమందిరముఁ జే
ర్చెమదనారిరహిన్ ॥ (౧౪౪)

క॥ కలహంసప్రచ్ఛదపట । మలగంగాపులినరమ్య మైత
గుశయ్య । న్జలజాస్యతోడ శంకరుఁ। డలరుచు శయనించె రా
గమూర్తిన్ బొదలన్ ॥ (౧౪౫)

క॥ అదయకచగ్రహపీడిత । విధువునసజిగీషమతిని వేశిత
నఖమున్ । ఛిదురమణిరశనమగుత । న్మదవతిరతమిందుమౌళిఁ
దన్పకయుండెన్ ॥ (౧౪౬)

క॥ తరుణీమణిపై దయగల । వరుఁడుతదాలింగితాత్మవ
క్షుండగుచున్ । దురుసుగరిక్కలుప్రాలఁగఁ । బరువడినిద్రించె
బాన్పుపైనందముగన్ ॥ (౧౪౭)

గీ॥ కిన్నరులుమ్రోల మూర్ఛనల్పన్ని పెక్కు । రాగము
లఁబాడఁబద్మాకరములతోడ । విబుధనుతుఁడగుశంభుండు వేఁ
గువేళ । లీలవెలయంగసుఖముగామేలుకాంచె ॥ (౧౪౮)

క॥ ఆరమణినిహారుముక్తప । రీరంభులమానసాంబుప్రవ
దంచితముల్ । సారసపరిమళములుగిరి । భూరమణీయవనశౌ
యువులుభజియించెన్ ॥ (౧౪౯)

క॥ అప్పుడు తానూరువులం । దొప్పునఖక్షతులఁగాంచు
చుండఁగఁద్రపనా । చొప్పెఱిఁగి వానివలువ । న్గప్పెదుసతిశి
వుఁడు ముదమునన్వారించెన్ ॥ (౧౫౦)

గీ ॥ జాగరారుణ నేత్రంబుఁ జటులదంత । పీడితోష్ఠంబుల
పనప్రభిన్న తిలక । మాకులితకుంతలంబగు నార్య మోముఁ ।
గాంచి రంజిల్లెనా బేసికంటివేల్పు॥ (౧౫౧)

చ ॥ ఉరుతరబంధవిష్ఠపుటితోత్తరవస్త్ర విరాజమాన
ముఁ । సురుచిరమధ్యదేశగవిసూత్రమణీ మయమేఖలంబుఁ
ద । చ్చరణవిభాసి యానకరసక్రమచిహ్నముసైనపానుపు ।
న్మారుఁడు త్యజింపఁడయ్యె దెసలన్నియుఁ జాలఁగఁ దెల్లఁ బాటి
నఁ ॥ (౧౫౨)

క ॥ అయుతసుఖదతదోషం । బాయభవుం డుడుగఁ కాని
యలరుచువిజయా । తోయజలోచన దెల్పఁగ । నాయెడఁగ
న్పడఁ దుడశేఁ నాథుఁ లకై నఁ ॥ (౧౫౩)

చ ॥ ధృతరతిగంధమాదన గిరిన్నిరతంబు రమించుచుం
డఁగా । ఋతువులునూటయేఁబదొక రేయివిధంబున నేగఁగా
కత । ద్రతసుఖ పంక్తిచేఁ బ్రమథ రాజునకుం దమిదీఱదయ్యె
ను । ద్యుతిమగుకంధి మధ్యబడబాగ్నికిఁ దత్సలిలంబులఁ బ
లెఁ ॥ (౧౫౪)

క ॥ శ్రీక్షితిరక్షణదక్షిణ । దక్షిణదోర్దండ దండితద్వి
డ్వార్యా । లక్షణలక్షితసత్కవి । రక్షణ ధీవిజితవిబుధ రాజా
చార్యా ॥ (౧౫౫)

(భుజంగప్రయాతము) ॥ మనీషివ్రజామ్నాయ మార్గో
క్తగోష్ఠీ । వినోదప్రమోదప్రవేశాత్తచిత్తా । జనానందపీయూ
ష ప్రసారప్రభావా । పనీతార్థిదైన్యాదివార్ధ్యగ్రసత్త్వా (౧౫౬)

గద్యము॥ ఇది శ్రీముకుంద చరణారవింద వందనానందమా
రందతుందిల మానసేందిందిరుండును శ్రీమన్ముద్దుకృష్ణధ
రాపురందర నిరంతర విశ్రాణిత వివిధమణి కనకభూ
షణ సదంబరాలంకార మహాగ్రహారాది సముపభో
గ సంజాతప్రమోదసుందరుండున శేష భాషా శేష
సారస్వత శేష శాస్త్రప్రియ చ్ఛాత్రుండును
విరుదరాజకులకలశాంభోధి రాకాశశాంక
వేంకటాద్రిరాజపౌత్రుండును వెంగల్వరా
జకవిరాజసుపుత్రుండు నుభయభాషా
భూషణుండును రసికతోషణుండును
సుకవివిధేయుండునగు శేషాద్రినా
మధేయుండు విరచించిన కు
మారసంభవ కావ్యంబున
దృతీయాశ్వాసము.

శ్రీమదాంధ్ర కుమారసంభవ కావ్యంబున
తృతీయాశ్వాసము
సమాప్తము.

చియామహా । నటుఁడతిసంశయంబున మనంబుననారసి దా
నిసెంతయు । న్నటుకపటంబునన్నిహగ ఖావముఁదాల్చినయ
గ్గిరియంచుధీ । పటిమ నెఱింగి కిన్క-గనుపట్టఁగ భ్రూకుటిఁ
బూనెనామెడక్ ॥ (౪)

ఉ ॥ అంతమహేశుఁగన్గొని భయంబున నంటఁగరానివే
ల్పులోఁ । జింతిలి యాత్మరూపమును జేకొని యంజలి బంధ
మూడఁగా । నెంతయు వింతగాఁగ నొడలెల్లవడంకుచునుండ
నాయుమా। కాంతునితోడ నిట్లువలుకందొడఁగెఁ గడగం
డ్లునైకొనఁ॥ (౫)

గీ ॥ నీవు జగదీశ్వరుండవు నిర్జరాళి । యాపదలఁ బా
పుదేవుండవగుటఁజేసి । దనుజులకునోడి యింద్రాదులనవర
తము। నిన్నుఁగరమర్థిఁ సేవించుచున్న వారు॥ (౬)

క ॥ సతిఁగూడినూటయేఁబది । ఋతువులఁగడచిరివిసుర
త మింపెసలారఁ । శతమన్యుఁడు నినుఁ గానమి। వెతలందు
చు నున్నవాఁడువేల్పులతోడఁ ॥ (౭)

గీ ॥ నిన్నుఁగొలువంగ మనములనెన్నిమఘవ । ముఖ్యుల
తీఱంప నప్పనిఁబూనియిటకు । నవసరోచిత వేషంబు నధిగ
మించి । యరయఁగావచ్చినాఁడఁస్మరారినిన్ను ॥ (౮)

క ॥ ఇదిహృదయమందునిడిరో । మదనాంతక యస్మ
దీయ మంతుప్పునైఁపం । గదెమాతఁరుపీడింపఁగ । నాదిగె
దు వారలువిలంబ మోర్వంగలరే ॥ (౯)

క ॥ ఇట్టులుగనేలకను మొక । పట్టినతనిసేనకెల్లఁ బతిఁగాఁ

గాని బ । ల్గట్టిగవేలుపుం దొరనిజ । పట్టణముం ద్రిభువనము
లంబాలించునిరగ్ ॥ (౧౦)

వ ॥ అని వినుతించి ॥

గీ ॥ డాసియీరీతి నసలుందు చేసినట్టి । విన్నపంబునశూ
లి ప్రసన్నుఁడయ్యెఁ । దెలివిగలవారు మాసైనపలుకుచేత।నీ
శులకునెల్లసంతోష మిత్తురెపుడు ॥ (౧౧)

క ॥ ఈపగిదినలరుశంకరుఁ । డేపునఁదారకునిఁగెలుచునిం
దోర్జితసే । నాపతిఁ బుట్టింపఁగఁ జ్ఞ । ల్గోపికతో మదినిజం
తయొనరించెఁదగన్ ॥ (౧౨)

చ ॥ సతతమునూర్ధ్వరేతుఁడగు శంకరుఁడావిజనస్థలం
బున । న్వితతరతావసానము నవిఘ్నముగల్గిననంతలోపలన్।
జ్వలితమయి కల్పకాల పరిశోభితపావకుఁబోలువీర్యమా। యు
తగతి నాధనంజయుని యందునిచెంజెనుచిత్రమారఁగన్ ॥

చ ॥ ఉరువడివేఁడిమైపరఁగు నూరుపుచేతనువన్నెఁ బా
యువి । స్ఫురదురుదర్పణోత్తమముపోలికశాంభవవీర్యముం
చుట । న్స్ఫురిపారినీరుపాపతనపూర్వపు కాంతినివీడనాడిస।
త్వరముగ నామొడ స్మలినవర్ణముఁజెందె నమందవైఖరిన్ ॥

గీ ॥ ఆర్య రతివిఘ్నమున కాత్మనలిగిసర్వ । భర్తయ్యేఁడ
వు క్రూరతరకర్మపరుఁడవధిక । కుష్ఠగతుఁడవుభృశధూమ
గుంభితుఁడవుఁ । గమ్మనుచువహ్ని కపుడు శాపమ్మునొసఁగె ॥

చ ॥ సొరిదినిదత్తుశాపమున శోషమునొందితపించు శ
ర్వరీ । కరుఁడునుబోలెమంచువడిఁ గ్రాఁగినతామరమొగ్గమా

నాడ్కి । స్మరహారునుగ్రవ్యీముభృశమ్ముగఁ దాల్చుటఁజేసిపా
వకుం । డరిది విరూపమున్గొని తదాలయమున్వెడలె స్రయం
బునన్ ॥ (౧౬)

గీ ॥ అనలుఁగాంచి యసుణితాక్షుఁడై పేర్మిఁ జేసి । చ్చితుల
చేత మొగమునతముఁ జేసి । యున్న గిరిజనభవుఁ డెన్నఁగసర
సంపు । నుడుగుచేతఁ గేర్చెఁదడయుక పుడు ॥ (౧౭)

చ ॥ అలరఁగఁ బార్వతీసతిని రంకము ఫేందునియందుఁ జె
మ్మటం । గలసినకజ్జలం బప్పుడుఖుండకశంకము గా వెలుంగఁగా ।
మలవిలుదాలు పెంతయును మక్కువచ్ఛేదనయుత్తరీయపుం ।
బలుచనికొంగు చేతనదివా పెముదమ్మొదనంకురింపఁగన్ ॥ (౧౮)

క ॥ చలమునుమండమున్విస్నాం । గులియగుహస్తమునశి
ఫుఁడు కన్నుమొగమునన్ । గలచెమ్మటఁదొలఁగించుచుఁ । జె
లిమిన్వ్యజనానిలమ్ము చే హరి యుంచెన్ ॥ (౧౯)

క ॥ రతిజాతివిరులురాలఁగ । సతిభుజములఁ ప్రేలుకేశసం
చయములసఁ । గ్గతిఁ బారిజాతమాలిక । హితముగబంధించె
నీశుఁడె మ్మెదలిఁకన్ ॥ (౨౦)

క ఉరుశక్తిమనసుత్రిజగ । ద్వర మోహనమంత్ర వర్ణ
పంక్తులనఁగనా । గిరిసుత చెక్కులఁ గస్తురి । నరుదుగఁబత్రిక
ములుం జెమొరుఁడు వేశన్ ॥ (౨౧)

క ॥ భువనముల గెలువమరుఁడా । హవమునకై యెక్కు
నరదమనఁదగు గౌరీ । శ్రవిముల వదనమ్మునకు । స్నవముల
బతిక మ్ముల నెడు చక్రములుంచెన్ ॥ (౨౨)

గీ॥ జాళువాకట్టు కవమీఁద ప్రేలుగాఁగ । నిర్ఝరయు
గంబుసిరిగతి నెగడఁబట్టు । పున్నఁగవ ప్రేల శంకరుండన్నమి
న్న । యఱుతనొక మంజుమౌక్తికహారమునిచె॥ (౨౩)

క॥ అతులనఖక్షతములఁదగు । సతిపిఱుఁదుల నాత్మమా
నసమ్మృగముఁ గట్టన్ । రతిపతిపాశమనంగాఁ బతియపుడొక
రమ్యకాంచి బంధించె రహిన్ ॥ (౨౪)

గీ॥ భర్గుఁడంజనంబు ఫాలాగ్నిసెగలోన । గాఁచి గిరికు
మారికనులనునిచి । పులకితమును గప్పు నెలకొన్నదగుతన ।
సుందరయంబ ప్రేలుదుడుచుకొనియె ॥ (౨౫)

క॥ సుదతికిఁ బదకమలంబుల । ముదమున లాక్షారసం
బుఁ బూసిహరుండా । పిడసఁగర రక్తిమంబది । వదలింపఁగ
మాళిగాఁగ వారింగడిగెన్॥ (౨౬)

గీ॥ చెలఁగు బూదిపూఁత గలిగినతనచేత । దర్పణం
బుఁదుడిచి తమిహరుండు । వేషలక్ష్మినెల్ల వీక్షించుటకుఁబవ ।
రాలికింపుమీఱ నప్పుడు సూపె ॥ (౨౭)

క॥ పతియొసఁగిన దర్పణమున । సతికూటమిగుఱుతుల
రసిసాంద్రత్రపయై । వితతానురాగ మంచిత । గతిఁ బులకలచే
తవెలికిఁ గన్పడఁ జేసెన్ ॥ (౨౮)

క॥ పతిగావించిన సదలం । కృతినద్ధమునందుఁ గాంచి పృ
థుసౌభాగ్యా । న్వితలగు నెలఁతలలోపల । క్షితినుత్తమురా
లననుచు గిరిసుత వలఁచెన్ ॥ (౨౯)

క॥ జయవిజయయుననను చెలులా । లయామధ్యము వం

దునీశులలితాంకముపైఁ । బ్రియమునను౦డెడినువవా । సి
యమరనుపకరణములనుసేవించిరొగిఁ॥ (30)

ఉ॥ శ్రీలలరారఁగానతనిచిత్రచరిత్రములెల్లఁగూర్చివై। తా
ళికులుచ్చనాదములఁ దద్దయుసన్నుతిచేసి రామోఁడ। న్జాలఁ
గఁగిన్నరుల్బయులశంఖరవంబుఁదివంబుబ్రాఁకఁగా। శూలికివే
డ్కపుట్టఁగనుసొంపుగఁబాడిరియాడిరచ్చరల్ । (3౧)

గీ ॥ ఆలపోతప్డుమ్రొక్కిడి కేలుమోడ్చి । సురుచిరంబు
గనుచితావసరమునందు । దేవగణములునీపాదసేవసేయ। వేఁ
డెదరటంచుహరునకువిన్నవించె। (3౨)

ఉ । అంగముకాంతిరాజిలదయామతిమానస రాజహం
సిఁయై । పొంగుతురషాభూమి ధరపుత్రిక హస్తముఁగేలఁబూ
నియా । యంగజకేళికాభవన మయ్యెడవెల్వడికొండవీటిబ!
ల్జంగమమర్త్యలుల్లసిలసద్గతితోనెదురేగ వారికిఁ॥ (33)

క । ఇంద్రాదులైనవేల్పులు । ముందుగ నాయీశ్వరు
నకుమ్రొక్కిడియొగినా। యిందుముఖయైనగారికి । వందనము
లుచేసిరపుడవారితభక్తిఁ । (3౪)

గీ ॥ అట్టిసురలకుసమ్మాన మాచరించి । వచ్చినట్టుగవా
రలఁబంచియవల। దండఁజేరిననందికై దండఁబూని। వృషము
పైనెక్కియింతితోవెడలెనపుడు ॥ (3౫)

క। మనమునకంటెనువేగం । బుననెగడెడునద్దునెక్కిపో
వఁగమింట । న్గనిఖేచరులందఱునా। యనకంజలిఁజేసి మ్రొ
క్కిరంచితభక్తిఁ। (3౬)

గీ॥ స్వర్ణదీవారివిహరణ చారియువతి। కామకేళీశ్రమ శ్రాంతి కారిమఱియుఁ। బారిజాతలసద్గంధ హారియైన। గాలివారలసేవించెలీలమెఱయు॥ (౩౭)

గీ॥ అధికతాకాశభాగంబునర్ధచంద్రు। ధరముమఱిభోగిభోగావృతమువిభూతి। భాసురంబౌచుఁదనమూర్తిభంగి నున్న। రజతగిరిఁజేరెనావేళరాజమౌళి॥ (౩౮)

గీ॥ అలరుపటికంపుగోడలోనాత్మబింబ। మరసిసిద్ధాంగనామణులన్యదీయ। యనుమభ్రమఁజెందినిజనాథులప్పుడుమ్రొక్కి। నేఁడుకొన్నసుమానంబువీడరచట॥ (౩౯)

ఉ॥ పేరిమిమీఱినందుఁ బ్రతిబింబితుఁడై స్ఫటిక ప్రభాప్తిఁ బెం। పారఁగగుప్తుఁడై పరఁగునంబుజవైరి కళంక రాజిదు। గ్ధారమణీశిరోమణితిరంబుగ నుంచఁగవన్నెమించుక। స్తూరికడంగుక్రొందునియశోభవహించికరంబురాజిలున్॥ (౪౦)

క॥ డంబగుతద్విత్రికందమ। బింబములీక్షించికినుకద్విరదములొగిని। కట్టఁబుగమదయుతపరనా। గంబులనుచుబ్రమసిదంతఘాతమొనర్చున్॥ (౪౧)

క॥ అతులస్ఫటికాలయములఁ బ్రతిఫలితములైనబుధపంక్తులరజనీ। తతులఁగనిసిద్ధకాంతలు। రతిరాలినముక్తలనుచుబ్రమయుదురందున్॥ (౪౨)

గీ॥ అమరనారీపరిష్కృతికర్దమైన। చందురుఁడుశృంగభాగంబుఁజెందినపుడు। కొండలకురాయఁడగు వలవెండిమలకు। రమ్యరుచియైననవశిరోరత్నమగును॥ (౪౩)

క॥ అలపర్వతమున వేల్పులు । పొలఁతులతోఁ గూడి విజన భూములఁ గ్రీడ । ల్సలుపఁ దమ బింబములఁ గని। పలువురు నంటు న్నయట్లు భావింతురొగిన్॥ (౪౪)

గీ॥ ఇందుశేఖరుఁడైన గౌరీశుఁ డంత । నంగననుగూడి కైలాసశృంగమందు । వారకయనూనరమ్యశృంగారచేష్ట । లల రుచుండఁగ విహరించు నెలమితోడ॥ (౪౫)

క॥ హరు కేలుపట్టుకొనియ। త్తరుణి విలాసమునగ వేత్రధరుఁ డౌనందీ । శ్వరుఁడు తనముందు నేగుచు । సరణింజూపఁగను సంతసంబునఁ దిరిగెన్॥ (౪౬)

మ॥ చలదత్యుచ్చశిఖాగ్రుఁడై వికటపస్ఫారాంగ భంగుండునై । విలసత్పంతురుఁడైన శాతసుమృగశ్వేతాత్రితుంగుండునై । పొలుపుంగాంచుచు భృంగికుఁడు గ్రుసిలసద్భ్రూసంజ్ఞచే మెచ్చియా। చెలికిన్వేడుక పుట్టనతఁ డనుమదాఁ జెసెంగరంబుద్ధతిన్॥ (౪౭)

క॥ కాళిహాసినాట్యఁబున్కల ।మాలికలటుతాంజలింపమతి యనుదంష్ట్రా । భీలతముఖంబునెగడఁగ । శైలాత్మజకెలమికై వెసన్నటించెన్॥ (౪౮)

క॥ వారిస్వరుప రిటులాడుచు । భైరవనాదంబు సేయ భయ విహ్వలయై । గౌరియురాగంబునమని । నారిన్సంభ్రమముతోడ నాలింగించెన్॥ (౪౯)

క॥ ఉన్నతములనుపటులునగు । చన్నులువడి రాయగిరి జసంశ్లేషింప । చ్ఛిన్నందిహరుఁడుపులకల। మన్ననచూపట్ట నపుడె మత్తుండయ్యెన్॥ (౫౦)

క॥ విజితేంద్రియులగు ప్రమథులు । భజియింపను మావిలాసపరితోషితుఁడై । గజదనుజ శాత్రవుండా । రజతాద్రివసించెమనసురంజిలుచుండన్॥ (౫౧)

వ॥ అంతనక్కడ॥

క॥ అమరనివహమ్ముతోడస । భామంటప మందునున్న బలరిపుకడకు । ద్ధామాభవతేజంబుమ । హామహిమందాల్చియనలుఁడరుదెంచెరహిన్॥ (౫౨)

గీ॥ ధూమ్రమధూమాంగుఁడయికడుదురవలోక రూపుఁడైనట్టియానీరుపాపనపుడు । వేయికన్నులనెంతేని వింతగాఁగ । నాదరంబునవీక్షించె నమరవిభుఁడు॥ (౫౩)

క॥ ఈపగిదిదైనయగ్నివి । రూపమునీక్షించి యలమరుత్వంతుఁడు పె । ల్లోపమిమదిగలఁగఁగహర । కోపసముత్పన్నమిదియగుననితలంచెన్॥ (౫౪)

గీ॥ విస్మితాస్యులగుచువిబుధులుపలుమాఱుఁ । దన్నుఁజూచుచుండఁ హానుఁడప్పు । డాదరంబుతోడనమరాధినాయకుం । డొసఁగినట్టిపీఁటనొగివసించె॥ (౫౫)

క॥ జ్వలనాయియాదుర్దశనీ । కులభించెనిదేమొదీనిఁగొంకకనాకున్ । దెలుపుమననుర్వీవుచ్చుచు । బలసూదనుతోడవహ్ని పలుకఁదొడంగెన్॥ (౫౬)

గీ॥ అవధరింపుము కరుణనాయంగలార్పు । వఘురనాథయనుల్లంఘ్యమైననీదు । శాసనంబునఁబ్రావురా వేష మూని । మొదలువడఁకంగమృడుడున్న యునికికేఁగి॥ (౫౭)

గీ॥ చెలఁగునుమఁగూడిరతులచేనలరుచున్న । వానిబూ
చులయెకిమీనిఁగాననేగి । కాలునకునుద్దియగుమహాకాలురూ
ప । మేనుగనుఁగొంటినెంతయు హృదయమగల॥ (౫౮)

క॥ కైతవవిహగమనగున । న్నాతఁడుజ్ఞానమున నెఱిఁగి
యతికుపితుండై ।యాతఁటినిజఫాలానల । హేతుల హోమం
బుసేయనెంచెమహేంద్రా॥ (౫౯)

గీ॥ అప్పుడునేఁ బ్రమొక్కిమధురమ్ము లర్థయుతము । లైన
పల్కులనుతియిుంపనభవుఁడంతఁ । దనిసినాపైని మదిలోననె
నరుఁబూనె । స్తోత్రమొనరింప నేరికిఁదుష్టిగాదు॥ (౬౦)

వ ॥ అంత ॥

క ॥ జగములనెల్లంబ్రోచెడు ।భగవంతుఁడు శంకరుండు
ప్రజ్వలితంబై । నెగడుతనకోప వహ్నికి । నగపడ కుండంగన
సురయుంబునఁగాచెఁ ॥ (౬౧)

క॥ గిరిరాజప్రియతనయా । పరిరంభమువిడిచియప్పుడపా
రప్రీడఁ । స్మరకేళీసౌఖ్యంబున । విరమించెఁ జంద్ర మౌళి
విబుధాధీశా ॥ (౬౨)

క॥ మరుకేళిభంగమగుట ।న్బరిగళితంబగుచు మిగులభర
మైత్రిజగ । త్పరిదాహకమగు తేజం । బురువడినాయందునుం
చెనుగ్రుండురహిఁ ॥ (౬౩)

క॥ కడుదుస్సహము మఱియును । బిడుగునకెనయైనమృ
డునివీర్యము పెలుచ ।నడుకొని కాలుచు కతమున । నొడలువ
హింపంగనిముసమోరువనై తిఁ ॥ (౬౪)

గీ॥ మిగులతీక్ష్ణమైనమ్మృషుని తేజమునన్ను । గాల్పఁజొ
చ్చెనిపుడు గండుమీఁతి । ప్రబలకిరణ నాదు ప్రాణరక్షణము
గా । వింపుమయ్య తగనిలింపనాథ ॥ (౬౫)

క॥ ఈకరణిఁబీతిహోత్రుఁడు । వాక్రుచ్చినదానివిని కృపం
సగ్గతమా। కాఁకశమియింపఁజేయశ।చీకాంతుఁడుమనములో
నఁ జింతించెనొగిన్ ॥ (౬౬)

క॥ శివతేజోదగ్ధములగు । నవయవములఁ జనదు చేతసం
టుచునొగినా।పవనునియనుంగుఁగని వా।సవుఁడీగతినించుకం
త సంభాషించెన్ ॥ (౬౭)

గీ॥ నీవుప్రీతుండ వగుచును నీరుపాప । కోరిస్వాహాస్వ
ధాహంత కారములను । దేవపిత్రు దేవమనుజుల దినముదను
పు । కారణంబున మొగమైతివారికెల్ల ॥ (౬౮)

క॥ హోతలునీయందుహవి । వ్రాతంబులువేల్చివీతపా
తకులయివా । రేతెంతురు స్వర్గమునకు । ఖ్యాతిగఁదర్త్రా
ప్తికీవె కారణమనలా ॥ (౬౯)

గీ॥ మంత్రపూత హవ్యమండలి నీయందు । వేల్చి తపసు
లెల్లవీతిహోత్ర । యొగిఁదపఃఫలంబు నొందెదరటుగానఁ । బ
రమతపములకునుప్రభుఁడవీవు ॥ (౭౦)

గీ॥ హుతముభాస్కరునకు నొసఁగెదవాతండు । జలదుఁ
డగుచువృష్టివెలయఁజేయు । దానవన్నములును వానిచేఁబ్రజ
లును।బ్రబలుచుంట భువనపతివినీవు॥ (౭౧)

క॥ తలకొనిభూతాంతరముల । మెలఁగెదవవిగలుగుఁబో

సుమీనీవలనన్ । బలుజగముల కునుజీవిత । మలఘుప్రాణదుఁ డవీవయైతివిదహనా ॥ (౭౨)

క॥ వారకబహుజనములకుప । కారకుఁడవునీవయైతి కా ర్యములెల్ల । న్గూరుపనీకంటెనునే। వారున్నేర్పరులులేరు పావకజగతిన్ ॥ (౭౩)

క॥ ఈవిబుధులకార్యమ్ములు । గావించెడువాఁడ వీవొకండవెనిజమూ । భావింపస్వర్గమైనను । బావక యుపకారకులకు భద్రంబయగున్ ॥ (౭౪)

గీ॥ మున్ను మేమంగజుని భక్తివెన్నునకును । పాపఁబూజింపనదివేడ్కఁబరిఢవిల్లుఁ । గానవిందుమునుఁగుముకరుణఁ బూని । ప్రబలతావకరూపంబు పాయుననల॥ (౭౫)

క॥ కావునఁదడవించుకయును । గావింపకగంగకేగు కడువడిఁజేయం । గావలయుకార్యములుబలు । చేవన్వేగముగఁజేయసిద్ధంబులగున్॥ (౭౬)

గీ॥ వేయునేటికినిక్కంబువేల్పులేటు । మొనయనంభోమయాంభవమూర్తిగాన । వగలఁబొగిలెడు నీవల్ల నగతనూజ। కాంతువీర్యంబుధరియింపఁ గలదుదహన॥ (౭౭)

క॥ ఈలీలఁబలికియింద్రుఁడు। చాలించినప్పుడేకృశానుం డతని । న్వీడుకొనిగాఢమైతగు । వేడుకతో నమరనదికి వెడలెవ్వనడిగన్॥ (౭౮)

క॥ ఈరీతివెడలియత్తతి । దారిన్మదమునవేగదాఁటికృశానుం । డాహూథిసకలకలుషో । త్తారకమగు నమరనదినిదతియంజేరెన్॥ (౭౯)

సీ॥ నిర్జరపురి నెక్కు నిచ్చెనయును ముక్తిమార్గాధిదేవ
తమార్గము లేని। కలుషౌఘములనెల్లఁ బొలియించు నదియు సం
సారమహాదుర్గ తారిణియును। హరజటాజూటమందిరతాప
హారిణి కామిత ప్రజామృతకారిణియును। ధర్మధారిణి రమా
ధవపాదసంజాత యబ్జజలోక సమాగతయును। మొనసి స్రో
తస్త్రయంబున ముజ్జగములఁ। బూతములఁ జేయు నదియుప
యాతుఁడైన। యనలునవ్వాడు లసదూర్మిహస్తములను। జె
న్నుమీఱంగఁబిల్చెఁ బ్రసన్నకరణి॥ (౮౦)

క॥ కలకూజితములు సమ్మద। కలితములగు సంచగములు
గలగంగఁ ఘధం। బులని చ్చెద దుఃఖంబులఁ। బొలియించెద నం
చుఁబల్కెఁ బొరిఁ బిహసునితోన్॥ (౮౧)

గీ॥ అమ్మెలి విహించినట్టుల నమరగంగ। చెలఁగి దరిదాఁ
కుచున్నట్టియలల చేత। భీమ తేజంబు చేతను బెండువడిన। గాలి
నెచ్చెలి కెదురేగెలీల వెలయు॥ (౮౨)

క॥ సంతాపతప్తుఁడనలుఁడు। ప్రాంతంబుననున్న గాంగవా
రిమునింగెన్! వంతలగుం బెడువారో। క్కంతైన విలంబమో
తన్ రేయెందైనన్॥ (౮౩)

గీ॥ గాఢశుభకారి నత్యంతకష్టహారిఁ। బ్రబలతరపుణ్యభా
రిని బాపతారిఁ। గడలిపట్టంపునారియౌ గంగవారి। మునిఁగి
యనలుండు సౌఖ్యంబు ననుభవించె॥ (౮౪)

క॥ ఉల్లోలంబుల వెలయుచు। నెల్లర పాపాపదోఘము మెడఁ
బాపెడునా। కల్లోలవతిని గారీ। వల్లభువీర్యంబు నుంచెఁ బావ
కుఁడెలమిన్॥ (౮౫)

క॥ అదివివర్తకల్లోలిని । యాదరమునశంభువీర్య మలరఁ
గఁదాల్చెన్ । మోదమున మిగులసౌఖ్యము । పొదుకొననా
యుఁసఖుఁడువడితో వెడలెన్ ॥ (౮౬)

క॥ అమృతమునుబోలుగంగా । విమలజలంబులనుగ్రుం
గివిఖ్యాతసుఖం । బమరంగ ధనంజయుఁడా । సమయంబున
వచ్చి నట్లచనియెన్వడిగన్ ॥ (౮౭)

క॥ అతిదుర్భరమగుగౌరీ । పతివీర్యముఁ దాల్చియమ
రవాహిని యవలన్ । వితతములగు తాపంబుల । కతిశయ
ముగ నగ్గమయ్యెనచ్చెరువారన్ ॥ (౮౮)

క॥ జలజంతువులార్తములై । ప్రళయానలశిఖలచేతఁ
గ్రాఁగినలీలన్ । బలువేఁడియైనగంగా । జలములవిడనాడి వె
లికిఁ జనుదెంచెనొగిన్ ॥ (౮౯)

క॥ అరుద్రతేజము ననరు । దారంగను గ్రాఁగి పొంగి
యతిఘోరములై । వారక ధరింపఁగూడని । నీరములభరిం
చెగంగ నిస్తులశక్తిన్ ॥ (౯౦)

క॥ జగముల కెల్లంగన్నగు । తొగసూడభ్యుదయమున
కుఁదొడరినవేళం । దగుమాఘమాసమునని । పుగపట్కృ
త్తికలుతానమునకేగునెడన్ ॥ (౯౧)

వ॥ ముంగల నగణితంబుగ గగనంబున కెగయు తరం
గశరంబులచే నాకలోకంబునంజేరి వారికెల్లసందర్శనావ
గాహనాచమనాదులం దెలుపుచున్న చెలువునం బొలుచు
నదియుఁ దనయందు మానుగఁ దానం బాడిన మానీంద్రు

ల నానావిధ పూజానూన సముచితంబులగు దూర్వాంకు రాక్షతాదులం గూడిన కుసమ విసరంబుల చేతం గ్రాలు కూలంబు గలిగి నదియుఁ బరమాత్మ చింతన సంతోషిత స్వాంతులును బ్రహ్మైక్య సంధాన నిరతులును బ్రహ్మాసనో పవిష్టులును యోగనిద్రాముద్రితులును యోగపట్టధరులు న గు పురుషులు దన్ను సేవించుచుండ నఖండశోభం దాల్చి నది యును మఱియుఁజరణాంగుష్ఠమ్ముల ధరణినిల్పి తపనబింబంబు పైఁ జూపుమోపి నిరతంబు పరమాత్మంజపించు బ్రహ్మర్షిగ ణంబులచేనుపసేవితంబునై సురగంగయుఁబోలె విభవంబునం దేజరిల్లుచుండె ॥

క ॥ దానింగని షట్కృత్తిక । లానందము నొందిరప్పు డధికంబుగనే । వానికి హద్దుమొసంగద । హీనామృత రూపమైన యీనదిపెలుచన్ ॥ (౯౨)

గీ ॥ చంద్రఖండంబుఁదాల్చినశంకరుండు । దేనినవిరళంబు శిరముపైఁ బూని యుండు । దేని నీక్షింపఁ బుణ్యమా దానిఁ గాంచి । కృత్తికలువిశ్వసించిరి చిత్తములను ॥ (౯౩)

గీ ॥ నీతిమీఱంగవారు నిర్ధూతకలుష । మోక్షదాయి ని పుండరీకాక్షపాద । జనితయగు సారవాహినీ వనజనదన కంజలి ఘటించిమ్రొక్కిడి రంతికమున ॥ (౯౪)

గీ ॥ అలఘుసౌభాగ్యముల కల్మిసులభయగుచు । భూరి జనులకు నిర్వాణకారియైన । యమరనదిఁగాంచి కృత్తికలా త్మఁబొందలి । సన్నుతించిరి తమభక్తివన్నెకెక్క ॥ (౯౫)

క ॥ వారెల్లనపుడు మోహ। స్త్రీరతిదూత్యజ్ఞములు ప్రసిద్ధములగుత । స్నీరముల ద్రుంగి వెగవి। దారితనిజకలుష లైరి తద్దయు వేడ్కన్ ॥ (౯౬)

క ॥ ఫలియించిన భాగ్యంబుల । సులభంబగు గంగయందు సుఖమజ్జనము । న్నలిపియలవారు తమ్ముం । బలుధన్యులఁ గాఁగ నాత్మ భావించిరొగిన్ ॥ (౯౭)

క ॥ సురనది మునుంగు నెడనీ । శ్వరవీర్యము వారియుదర భాగంబులలో। నరుదుగ ననిరవుకొనియె । న్నరియింపఁగ రానియుష్ణ భావముతోడన్ ॥ (౯౮)

క ॥ సహానునకైనయగుశివదు । స్సహ తేజమ్మున్ ధరించి షట్కృత్తికలున్ । వహియించిరతుల తాపము । ముహురంచద్గరళ వాధిన్ మునిఁగినరీతిన్ ॥ (౯౯)

గీ ॥ మండు చున్నయగ్గి మెండుగలోపలఁ । దాల్చుచున్న పగిదిఁదలఁకివార । లుగ్ర తేజమునకు నోర్వక క్షణములో । వెలికి వెడలిరంత వెఱచి మిగుల ॥ (౧౦౦)

గీ ॥ అప్పుడమరగంగ యలరంగవిడిచిన । రాజమాళిదివ్య తేజమెల్ల । వారియుదరములను జేరి వెలుంగుచు । నంచితముగ గర్భ మై చెలంగె ॥ (౧౦౧)

క ॥ కడుజ్ఞానముగలవారలు । మృదువీర్యమునోర్వక రెనిమేషంబునన । ప్పుడెగర్భ మాట యారసి । యొడయంద్రకు వెఱచిదుఃఖ మొందిరి పెలుచన్ ॥ (౧౦౨)

క ॥ వెనుకఁబతిభీతిసిగ్గును । బెనఁగొనననంతికముననందు వె

ల బిడ్డడై యిరుమూఁడు మొగములనెసఁగుకొమరు । లీల మైవీక్షించు వేళఁబార్వతితన చెలువునితోనిట్లుపలుకఁ దొడఁగెఁ । గంటెమునముందు దివ్యవిగ్రహముతోడఁ । గాననగున ట్టియీపుట్టఁగన్న భాగ్య । వంతుఁడెవఁడొక్కొ-యీకాంతిమం తుఁగన్న । తల్లియెవతియొ లలనామతల్లియగును॥ (౧౦౯)

గీ ॥ త్రిదివగంగయుననలుండుఁగృత్తికలును । నితఁడునా పట్టినీసుతుఁడెన్నటికిని । గాఁడటంచును గలహింపఁగారణం బ । దేమొయబ్బుర మగుచున్న దేమహేశ ॥ (౧౧౦)

క ॥ వారలలోపల నితఁడే । వారికుమారుండొ గరుడప న్నగదివిష । చ్చారణదైత్యులలోనే । వారిసుతుండగునొ తె ల్పు పర్వతధన్వి ॥ (౧౧౧)

గీ ॥ కుతుకముననిట్లు వేఁడెడిసతికిమంద । హాసమాస్య మునందుజెన్నారమిగులఁ । బ్రీతినానందసుఖహేతుభూతమైన। పలుకువచియించె శంకరుండెలమిచెలఁగ ॥ (౧౧౨)

గీ ॥ భువనములకుముదముపావలవేలుపులకు। శుభములె ల్లనొసఁగు శూరుఁడితఁడు । వీరమాత నీకు బిడ్డఁడు గాకు న్న । నన్యులకుఁదనూజుఁడగునెగ్గౌరి ॥ (౧౧౩)

సీ ॥ త్రిభువనములకును శుభకారియైన యీ తనయుసృ ష్టికినిదానమీవ । యంభోజ నయనరత్నాకరంబునరత్న ము దయించు టహరణంబకద నిజంబు । కాననాలింపుమో చాన యీవృత్తంబు నగ్గియుఁదేనుంచి నట్టిబీజ । మమరగంగాగర్భ మందుఁబ్రవేశించి యందుండికృత్తికలందుఁజేరి। యపుడుగర్భ మైననాకృత్తికలుశర । స్తంబమందుఁ జేర్పసకలభువన।సౌఖ్య

దాయకుండుచారుశరీరుఁడీ। తండువోడమెనందఖండరుచిని॥

చ ॥ తనరసమస్తవిశ్వహితదర్శనుఁడై తగుపీనిచేతమే।
లునుముదమొప్పఁబు త్రిణులలోపలనుత్తమురాలవై తిపెల్ల
నమదిసంశయింపకు విలంబముచేసెద వేలసీవుగ్ర। కుసు
తునిం ద్వదంకమునఁ గూర్పుముపర్వతరాజనందినీ॥(౧౧౫)

సీ॥ వామదేవుండిట్లుపలికిననాలించి యెల్లలోకములకుఁ
దల్లియైన। హిమశైలనందినిసమధికంబగుచున్న యెలమిచే
గాత్రంబుబలియనప్పు। డంజలిఘటియించి యమరులుఖేచ
రుల్పాటికిఁదనకు నమస్కరింప। వ్యోమయానముడిగ్గి ప్రేమచేఁ
దనయుని గ్రహియింపనుత్కంఠఁ గాంచి యవలఁ। ద్రిపథగ
యుఁబావకుండు నుకృత్తికలును। గెలుఁగవమోడ్చియానంద
లీలమ్రొక్క। వారినెంచక తనదుకుమారుఁ గొనియె। సుద
తియెవ్వతెసుతుఁగాంచిమదముఁగొనదు॥ (౧౧౬)

గీ॥ సమ్మదాశ్రులుకనుదోయిఁగ్రమ్మగౌరి। మ్రోలనున్నను
సుతుఁజూడఁజాలదయ్యె। నెమ్మిఁగరమునసుతుమేనునిమిరియి
ట్టి। దనగరానట్టిసౌఖ్యంబుననుభవించె॥ (౧౧౭)

గీ॥ అద్భుతానందములచేతనమరినదియు। వితతహర్షా
శ్రుతతితరంగితయుమఱియు। నమితవాత్సల్య యుతయునౌన
గకుమారి। కన్నుదోయికిఁదనయుండుగాననయ్యె॥ (౧౧౮)

గీ॥ తనయుఁజూచిగౌరి యనిమేష నేత్రస। హస్రమందఁ
గోరెనాత్మనంబ। సారెసారెకాత్మజాతునీక్షించుచో। నెవని
మనముతృప్తినెనయుజగతి॥ (౧౧౯)

ఉ॥ అమ్మెయిదేవదైత్యులుని జాంఘుిలవ్రాలినవేళవారి

పృ । ష్ఠమ్ములపై స్పృశించు కర సారసయుగ్మముచే నవోదిత
త్వమ్మునుబూర్ణచంద్రమహితత్వముగల్గి వెలుంగునాయపత్య
మ్మును జేరఁదీసితనయంకముజేరిచె గౌరిమక్కువన్॥ (౧౨౦)

ఉ॥ ఆజగదేకవీరునమృతాకర సన్నిభుఁడైన పుత్రుని।
భ్రాజితపూర్ణచంద్రముఖి పర్వతరాజకుమారి యంకమం।
దోజదలిసన్ భూరికరుణోన్నతిఁ జేరిచియాత్తపుత్రమా । రాజ
ముఖీకదంబమున రాజిలెనెంతయుఁ బూజనీయయై॥ (౧౨౧)

గీ॥ చెలఁగు సత్ప్రేమ రసమునసిక్తయగుచు। భూరిమో
దామృతంబునఁబూర్ణయైన । కతననొడినున్న సుతుఁగూర్చి
గౌరికప్పు । డేపుమీఱంగఁజనుదోయి చేఁపదొడఁగె॥ (౧౨౨)

మ॥ ఘనవాత్సల్యముమీఱఁగా నమరగంగాకృత్తికల్పేరి
మ । తనుజాతుండగువీనినేముచనుఁబాల్ద్రావింపఁగాఁగాన
మం । చునువీక్షింపఁగనాకుమార వరుఁడచ్చో మెచ్చి లోక
త్రయీ । జననీసత్కుచ దుగ్ధధారల మహాశ్చంద్రావెనందం
బునన్ ॥ (౧౨౩)

చ॥ వినుసిగదాల్పు వేల్పునకు వేడుకకామినియైన గౌరి
యుం। తనెనెమొగి సమ్మదాశ్రుకలితంబగునొక్కమొగంబుచే
తఁగాం । చనరుచిరైకనాళ జలజంబుల నాటిటఁ బోలుచు
న్నత । త్తనయుని యాఱుమోములును దద్దయుముద్దుగొనెం
బ్రియంబునన్ ॥ (౧౨౪)

సీ॥ మేరుగిరిమీఁదితీవబంగారుపండు । బలెను సురగంగ
హాటకాబ్జంబుఁబోలెఁ । దొలిదెసయుఁ గ్రొత్తచందురువలెఁ
గుమారుఁ । దాల్చినగరాజసుత నితాంతంబువెలిఁగె॥ (౧౨౫)

ఉ ॥ ఏమనిచెప్పవచ్చుఁ దరుణేందుధరుండపుడప్రమత్తుఁడై । తామదిసంతసిల్లి కయిదండ యొసంగఁగ దానిఁ జూనిశో। భామహనీయ విగ్రహుని బాలుఁగుమారునిఁజంకఁజేర్చియా । వ్యోమతలంబుముద్దుగొనుచున్న విమానమునెక్కెఁగౌరియుఁ ॥ (౧౨౬)

సీ ॥ ఎలమిపెంపునమేనఁ బులకలుజనియింప వలిమలల్లుఁ బలతనజలజవదన । యొడినున్న గాదిలి కొడుకును గ్రహియించెఁ బతియంకమందుండసతిగ్రహించె । సతియంక మందుండ శర్వుండు చేకొనెనతనియంకమునుండి యతివ గొనియె । నలఘుతరప్రీతిఁ దలిదండ్రులిర్వురాతనయునీరీతిఁ జేకొనిరిపిదప। నద్రిరాజతనయయత్తీసుధాపాత్ర । మైనపుత్రువేడ్కనప్పగించి । తన్నుఁగౌఁగిలింపఁ గ్రొన్నెలదాల్పుతో । నుల్లసిలుచువేగనిల్లుసేరె ॥ (౧౨౭)

ఉ ॥ అంతటసంతసిల్లి స్ఫటికాద్రి సమున్నత శృంగమందున।త్యంతమనోజ్ఞకాంతియగు నాత్మనికేతముఁ జేరిపార్వతీ। కాంతుఁడు చాలనబ్బురముగానొకపండువు సేయుఁదంచుబ। ల్మంతునకెక్కఁబారిషదమాన్యుల కానతియిచ్చెనయ్యెడన్ ॥

క ॥ ఆవలనెక్కుడు వేడుక । భావజహరునాజ్ఞఁ బ్రమథవర్గముగౌరీ । దేవి కుమారునకెంతయుఁ । జేవన్ జన్మోత్సవంబు సేయందొడఁగెన్ ॥ (౧౨౯)

గీ ॥ స్ఫటికమందిరములఁ బ్రమథులుముదమునఁ । గాంతులొలుకసంబుఁగప్పునవియు । విమలపారిజాతసుమరాజితములునౌ । కనకతోరణములుగట్టిరపుడు ॥ (౧౩౦)

చ॥ దెసలనిరంతరంబుగఁ బ్రతిధ్వనులొప్పుచునుండనిం
ద్రవా। యుసఖుపరేతరాణ్ముఖులయుగ్రతరాజ్ఞమెయిందదీయ
భృ। త్యసముదయంబుధీరనినదంబగునట్లుగఁదమ్మటంబుబ।
ల్పసమొరయించెనీభువికిఁ బఁడువుఁ దెల్పెడు మాడ్కి-మెం
డుగన్ ॥ (౧౩౧)

క॥ ఆయుత్సవమ్ముఁజూచ్చుట। కైయింటికివచ్చినట్టిగంధ
ర్వస్త్రీ। లాయుమ బహూకరింపఁగ। శ్రీయుతగీతములవెల
యఁజేసిరివేడ్కన్ ॥ (౧౩౨)

గీ॥ కానుకలతోడమాతృవితానమతని। యంతికముఁజేరి
దూర్వాంకురాక్షతాదు।లలరఁదలనుంచితన్మాత యట్లుశూలి।
కొడుకుఁ దడయకయొడినుంచికొనియెఁ బ్రేమ॥ (౧౩౩)

క॥ ఘనముగఁ దూర్యములెల్లన్। ధ్వనియింపఁగ నమ
రవార వనితలుసంధి। ప్రణుతముశుభతరగీత। మ్మునుభావ
రసానుబంధముగనాడిరొగిన్ ॥ (౧౩౪)

గీ॥ అతుల సుఖవాయువులువీచె నాశలెసఁగెఁ। బొగ
నువిడనాడియనలుండు నెగడె సలిల। మమలమైయొప్పె న
య్యుత్సవమున మఱియు। మిన్నతిమనోహరముగఁ బ్రసన్న
మయ్యె ॥ (౧౩౫)

గీ॥ గాఢమగుశంఖరావముఁ గలసియభవు।నింటభేరీని
నాదంబు లెసఁగెమింట। మానితాదిత్యదివ్యవిమానపంక్తి।
పెల్లుగనుదావిపూవుల జల్లుఁగురిసె॥ (౧౩౬)

క॥ మినుసిగవేలుపుకొమరుని। జననోత్సవమిట్లు సకల

జగములనేలమిం । దనుపుచునుండఁగఁదారక । దనుజేశ్వరు
సిరితనంతఁదలఁకందొడఁగెన్ ॥ (౧౩౭)

క ॥ విస్మటసుతుఁడువిచిత్రము । దమ్ములఁదగుబాలకేళిఁద
లిదండ్రులచి । త్తమ్ముల హరించెనుమనో । జ్ఞమ్మగు శిశుకే
ళి ముదమొనర్చుంగాదే ॥ (౧౩౮)

క ॥ హరుఁడును గిరిజయుదంతాం । కురమింతయు లేక
నొప్పుగొనుసుతుమొగము । ల్సరిలేనికోర్కెవేడ్కల । వరు
సన్నద్ధాడిరెల్లవారలుమెచ్చన్ ॥ (౧౩౯)

ఉ ॥ ఒక్కెడజాఱుచుండ మఱియొక్కెడ జాఱకయుండ
నింటిలో । నొక్కెడఁగంపమందమఱియొక్కెడఁగంపమునొం
దకుండఁగా । నక్కుమరుండు క్రొన్నడల నల్లనధాత్రిఁజరింప
నేర్చితా । మక్కువఁదల్లిదండ్రుల కమందముదంబొడఁ గూ
ర్చెనాయెడన్ (౧౪౦)

సీ ॥ రమణనించుకయుఁగారణముగానఁగరాని నగవుమొ
గంబున నెగడుచుండ । గృహాలసత్ప్రాంగణ క్రీడలధూళిచేఁద
నువుధూమలకాంతినెనసియుండ । నోరులకునెఱుఁగరాకుండు
నర్థముగల్గు పలుకులుపలుమాఱుఁబలికికొనుచు । నొడిలోనఁ
జేరియామృదునకపర్ణకు నెంతయుసంతసంబిచ్చిమఱియు।
నందిబటువుకొమ్ము లందియూఁచుచుఁదల్లి । జడలమొకముఁబట్టి
తడవికొనుచు । భృంగిశిఖనుబట్టియీడ్చుచుశిశుకేళిఁ । దల్లిదం
డ్రులకుముదంబునొసఁగె ॥ (౧౪౧)

ఉ ॥ అక్కుమరుండుశంకరుని యంకతలంబునుఁ జేరియా

ఘనుం । డొక్కటఁ గంఠదేశమున నుంచిన మించెడు పాము మోముఁ జే । రుక్కునఁ జక్కఁగాఁ దెఱచి యొందును దొమ్మిది రెండునైదుగా । కిక్కడ నేఁడు నుంబదిర హించు నటంచు గణించెదఁ దమ్ముల్॥ (౧౪౨)

గీ॥ జనకునఁ ఱుతఁ వ్రేలు ఫుసుక పేరు మొగంబు । లం దుఁ వ్రేలు సేచి కాయచట వరుస । బొసఁగి యున్న పండ్ల ముత్తియంబులటంచు । వానిఁ దీయఁగడఁగు బాలకుండు॥ (౧౪౩)

క॥ హరునితల నున్న గాంగశి । శిరవీచికలందుఁ జొచ్చి శీతలమగుత । త్కరసరసిజమా కొమరుం । డరయ లలాటాగ్ని శిఖలయందుం గ్రాఁచెన్॥ (౧౪౪)

గీ॥ ఇంచుక మనొజ్ఞముగ మెడవంచి యాన । మజ్జటాజూటుఁడగుచున్న మదనహరుని । శిరముపై వ్రేలు శశిఖండ మరుదుగాఁగఁ । దడవు ముద్దాడు నెయ్యంపు తనయుఁ డపుడు॥ (౧౪౫)

క॥ ఈలీల సుతుఁడు శైశవ ॥ ఖేలనములు సల్పుచుండ గిరిజా గిరిశు । ల్బాలఁగవినోదరసమున । నోలి వ్రేపవలు నెఱుఁగకుండిరి పెలుచన్॥ (౧౪౬)

శా॥ ఇమ్మాడ్కిం బ్రచురప్రమోదభరితమ్మెంతేని చింత్రంబునం । దమ్మా శైశవఖేలనావసర చేష్టన్సేయుచున్నీఱిమ । ష్ఠమ్మా వాసరమందు నెక్కుడు మనీష న్యావనం బందిశా । గ్రమ్ముల్ల స్త్రీముఁదానె నేర్చికొని యొస్కందుండ మందంబుగన్॥

క॥ సత్యజ్ఞానాత్మకభా । రత్యధిపతిసదృశవాక్యరచనాచతురా । మత్యనిశతిరస్కృతసుర । పత్యాచార్యాభిజనన పావనచర్యా॥ (౧౪౮)

తోటకము॥ దివిషద్వనితాధికధిక్కరణో । త్రుపదాయక రమ్యవిశాలవనా । జవవత్తరఘోటక సాంద్రగతి । ప్రవిభిన్న రిపుక్షితిరాట్పృతనా॥ (౧౪౯)

గద్యము॥ ఇది శ్రీముకుంద చరణారవింద వందనానందమ
రందతుందిల మానసేందిందిరుండును శ్రీమన్ముద్దుకృష్ణధ
రాపురందర నిరంతర వితీర్ణశిత వివిధమణి కనకభూ
షణ సదంబరాలంకార మహాగ్రహారాది సముపభో
గసంజాతప్రమోదసుందరుండున శేష భాషాశేష
సారస్వత శేష శాస్త్రప్రియ చ్ఛాత్రుండును
బిరుదరాజకులకలశాంభోధి రాకాశశాంక
వేంకటాద్రిరాజపౌత్రుండును వెంగల్వరా
జకవిరాజసుపుత్రుండు నుభయభాషా
భూషణుండునురసికతోషణుండును
సుకవివిధేయుండునగు శేషాద్రినా
మధేయుండు విరచించిన కు
మారసంభవ కావ్యంబునఁ
జతుర్థాశ్వాసము.

శ్రీమదాంధ్ర కుమారసంభవకావ్యంబునఁ
జతుర్థాశ్వాసము
సమాప్తము.

శ్రీరస్తు.

# శ్రీమదాంధ్ర కుమారసంభవము,

## పంచమాశ్వాసము.

క ॥ శ్రీలక్ష్మీనరసాంబా । శీలవతీగర్భవార్ధిశీతకిరణాది। కూకలంకప్రతాపా । స్మారితరిపు భూమిపాల ముద్దుల కృష్ణా॥ (౧)

వ ॥ అవధరింపుము తదనంతర కథా ప్రథనం బెట్లని యనిన॥

ఉ॥ క్రూరనిశాచరాధిపున కున్నదిలోభయమంది కుంరి బృం । దారకముఖ్యులెల్లనుఘనంబుగ వెంబడిరాఁబులోమపు । త్రీరమణుండపారమగు తృష్ణఁగలంగెడుచాతకంబుబ । ల్వారిదముంబలెన్వృషభ వాహుభజింపఁగనేంచియేగుచున్॥ (౨)

క॥ అరిభీతిన్ఖిలమగుపు । ష్కరమార్గము నందునుం డిజంభారియుమా । హరచరణాంకితరాజత । గిరిమీఁదికివేగ డిగియెగీర్వాణులతోన్॥ (3)

గీ॥ అంతమాతలికేలూఁత యందియతేఁడు । జలదమయ మగునరదంబునేలమిడిగ్గి । వేసవినిడప్పిఁగొన్నతఁడాసతోడ। నీరమునుబోలెహరునిల్లుసేరఁజనియె॥ (౪)

వ ॥ అట్లుచని ॥

గీ॥ ఇటునటుఁజరించు చుండఁగస్ఫటికశైల । భూమిఁబ్రతి బింబితుండైనయామహేంద్రుఁ। డొక్కఁడయ్యును దనుఁదానె పెక్కురనుచు । దలఁచికొంచునుహరుఁడున్న నెలవుసేరె॥ (౫)

ఉ॥ చారుఘృణీవిచిత్రమణి సంచయసంకలితంబువిద్విష। ద్వారభయంకరంబునగు బంగరుబెత్తముఁ గేలఁబూనిప్రాజ్ఞార మణీయుఁడై పరగు నందిపసన్వసియించుచున్నయా। సారస వైరిధారిగృహచత్వరవీథికినింద్రుఁడేగఁగన్॥ (౬)

గీ॥ గౌరవముతోడఁ జెంగటఁ జేరివిబుధ। నాథునలరించికనకదండంబుఁజంకఁ। జేర్చికొనిపోయి నందియాశివునికతని, రాక నెఱిఁగించెవినయంబురాజిలంగ॥ (౭)

క॥ భూరిసంజ్ఞవిభునియానతి। వాసిగఁగొనిసురలతోడిపర్వతివైరిఁ న్దాసివెనువెంట నభవని। వాసంబునఁజేర్చెనందివారనికూర్మిన్॥ (౮)

గీ॥ చండుఁడునుభృంగిమొదలగుసకలపారి। షదులుగొలువంగమఃశిశోభఁ బొదలుకొలువు। మంటపమునందు నున్నముక్కంటినపుడు। వేయికన్నులనీక్షించెవేల్పుఱేఁడు॥ (౯)

సీ॥ ఫణిరాజపృథుశిరో మణికాంతివెలుఁగొందు తతజటాజూటంబుఁదాల్చుకతనఁ। జెలఁగెడుపలుధాతు వులుగల్గుహేమాద్రి శిఖరసాదృశ్యంబుఁజెందిమఱియు। భూరితరంగ విస్తారమైతగనుత్త మాంగమందుండి తదంకమందు। నున్నగౌరినిదెలివన్నె ఫేనముచేత నవ్వునాఁదగుదేవనదిధరించి। విబుధనదివీచికలనుబింబించియున్న। యవయవంబులచేఁ బెక్కురగుచుఁదెల్ల। మంచుబోలినలవదంశు సంచయమున। హిమనిభుండగుచంద్రువహించువాని॥ (౧౦)

సీ॥ అధికతేజముచే తరుణామృతాంశుల నలయుశమాటికి

నపహసించి । కల్పకాలాహార్ణమై కంతునిఁగాల్చిన సెగకన్ను నొసటిపై నెగడువాని । గట్టురాకన్నియ వెట్టినవనీలకంఠభూషణమనఁగరముమెఱయు । నిజకంఠపరిల సన్నీలిమచేతను జెన్నుమీఱఁగవిరాజిల్లువానిఁ । దలఁపవెలలేనిమణులచేఁజెలఁగివెలుఁగు । చున్నకాంతుల నెంతేని వన్నెకెక్కు । కర్ణగతకుండలంబుల కైతవమున । భానుచంద్రులు గొలువంగఁబరఁగువాని॥ (౧౧)

సీ॥ కాలపీడితదేవకర్బురచితులలో బూదిచేఁదెల్లనై పొదలుమూర్తి । గజదైత్యచర్మంబుఁ గప్పిమేఘావృతంబగుమంచుమలసిరినెగడువానిఁ । గేలవిరించికపాలపాత్రముగ్రాలగోవింగుఁడునుదన్నుఁ గొలుచుచుండ । నరకుల్యములుగళాభరణమ్ములై యొప్ప వాభీలశూలమింపారఁదాల్చి । తలను గలచంద్రుఁడిడుసుధాధారదోఁగి । మగుడజీవించివేదముల్తగఁబఠించు । వనజసంభవునాడెంపుఁబునుకపేరు । నంచితంబుగమెడనుధరించువాని॥ (౧౨)

సీ॥ కాంచనమయలతా కాంతియై యొడిలోన సవిలాసముగనున్నశైలతనయ । చేతసౌదామిని చేశరన్మేఘంబురీతిగామిగులఁదీండ్రించువాని । నంధకప్రాణాప హారియునాసురకామినీవైధవ్యకారణంబు । నన్యులకగ్రాహ్య మగువిల్లుగలవాని మఱిమున్నె మరుఁగాల్చి మలయువానిఁ । గనకమయపాదపీఠమ్ముగల్గిరత్న । భాసురచ్ఛాయనొప్పు భద్రాసనమునఁ । బ్రమథులెలమిని వెలిచామరములిడఁగ । సన్నుతాకృతివసియుంచియున్నవాని॥ (౧౩)

గీ॥ సకలశస్త్రాస్త్రరతుఁడువిస్మయముతోడఁ । బ్రమథత తిచేత నీక్షింపఁబడెడువాఁడు । స్ఫటికగిరిచేని వాళింపబఁడెడు వాఁడు । నగుకొమరుఁగాంచిసంతసంబందువాని॥ (౧౪)

క॥ ఆరుదుగ్రనిసేవింపఁగ । జేరువఁగన్గొనినమఘువుచిత్తము గలఁగెన్ ।భూరితరతేజుకడనే। వారలమదిక్షణముకలఁకఁబడ యకయుందుర్॥ (౧౫)

గీ ॥ వికచవారిజముల శోభ వెలయునట్టి । వేయికన్నులఁ బార్వతీప్రియునిఁజూచి । విరులఁజెలువొందునవచూత తరువు పోలెఁ। బులకలెసఁగంగ నింద్రుండుపొలుపుఁగాంచె॥ (౧౬)

గీ ॥ ఇటులసర్వేశు నీక్షించియింద్రుఁడధిక । హర్షము నవెంతయేని కృతార్థుఁడగుచు । నంగసంజాతవైరూష్యమ ట్లుగగురు । పాటుతనముద్దియకువెగటాట యెత్తెఁగె॥ (౧౭)

క ॥ అంతటనింద్రుఁడు శంకరు । చెంతన్నస్త్రాస్త్రధరుఁ బ్రసిద్ధునిలక్ష్మీ । వంతు నలకొమరుఁ గని తన। యంతన్బ్రతిప క్షవిజయమగుననితలఁచెన్॥ (౧౮)

గీ॥ చేరఁగానేగినందిబంగారుబెత్తు । మోలి మణిబంధ మందుంచికేలుమోడ్చి । పరమతదనుగ్రహమునకుఁ బాత్రమ గుచు । వలిమలల్లునకీరీతిఁబలికెనపుడు॥ (౧౯)

క ॥ శ్రీకంఠనీకుమ్రొక్కఁగ । నాకాధిపుఁడవసరంబున రసెడినెదుటన్ । జేకొనియతనికినొసఁగుమ । హాకరుణన్దర్శనంబునర్థేంద్రుధరా॥ (౨౦)

ఉ ॥ నందికుఁడిట్లుపల్కి నయనంతరమామరలోక సేవ్యస
క్రందను ముందమందమగుగాదిలిచే నమృతంపుధార
లం। జిందుననంగనొప్పుతనశీతలదృష్టిననుగ్రహించెన । ర్ధేం
దుధరుండనేకజగదీశుఁడుమాహృదయేశుఁడత్తఱిన్ ॥(౨౧)

గీ ॥ ఆదితేయవంద్యుఁడాబలారాతి త్రి । లోకవంద్యుఁడ
గుపినాకి కపుడు । చారుమకుటనిహితపారిజాతంబులు । రా
లుచుండ్రమొక్కె మ్రోలఁజేరి ॥ (౨౨)

క ॥ లోకైకవంద్యుఁడగునా । శ్రీకంధరునకునమస్కరిం
చిమహేంద్రుం । డాకాలమందుఁ దత్కృపఁ । జేకొనిధన్యత
ముఁడగుచుఁజెలఁగెన్బెలుచన్ ॥ (౨౩)

క ॥ సారిదినివేల్పులుశంకరు । చరణాసనమునకుఁ బారి
షదులెంతయున । బ్బురముగఁగనుఁగొనుచుండఁగ । నురువ
డివందనమొనర్చిరున్నతభక్తిన్ ॥ (౨౪)

గీ ॥ భవునియాజ్ఞనెదుటఁబ్రమథులు రాజాహ్వ । హై
మపీఠమిడిననందుఁజేరి । యెలమిఁజెందెనింద్రుఁడలఘుప్రభుప్ర
సాదంబుజనులకతిముదంబకాదె ॥ (౨౫)

క ॥ మందస్మితసుందరమగు । చంద్రధరు విలోకనమున
సంభావితులై । యందఱుదివిజులు నాతని । ముందఱఁ గూ
ర్చుండిముదముఁబొందిరిచాలన్ ॥ (౨౬)

గీ ॥ కారుణికచిత్తుఁడగు నంధకారిశత్రు । పీడలఁగలంగి
మొగములువాడువాఱ । నంజలిఘటించికొనియున్న యమర

గణము౯ । గాంచియీచందమునవచియించెనపుడు ॥ (౨౭)

గీ॥ విపులశస్త్రాస్త్రములుదాల్చి విక్రమాఢ్యు । లగునమ రులార నేఁడుమీ మొగములిట్లు । మంచు చేగాటముగఁ గమలిం చఁబడిన । కమలములుపోలె దైన్యంబుఁగాంచ నేల॥ (౨౮)

క॥ ఎక్కుడుపుణ్యముగలిగియు । నక్కటస్వర్గణంబువిడి చియుడలుచుమతియు । న్నెక్కుడధికారచిహ్నము । లుక్కతి విడనాడిమీరలుండెద రేలా॥ (౨౯)

క॥ మీధైర్యముమానంబుమ । హాధామముస్థైర్య ముడిగి యంకిలిపొడమం । గాఢాత్రినిట్లుమానవ । సాధారణులైతి రేల సరగంజెప్పుఁడా॥ (30)

క॥ అనితరసాధారణమును । ఘనతరమతి సౌఖ్యమునుని కామమనోజ్ఞం । బునుబూజనీయమగుమీ । మనికిన కారణమ విడిచిమతిఁ గెద రేలా॥ (3౧)

గీ॥ త్రిదశులార మీదుహృదయవీధులయందు। నిరవుకొన్న దిటమ దెల్ల నేఁడు।ఘనతరోష్ణముననగాఢంపుమడువునఁ। గలు గుజలముపోలెఁబొలియ నేల॥ (3౨)

క॥ ఆతురతమీఱఁగాఁబురు । హూతునితోఁగూడిమీరలా కటనేఁడిం । దే తేరమిమ్ముఁ ద్రిభువన । ఘాతుకుఁడగు తార కుండుగారించెనొకో॥ (33)

క॥ అనీశిచరపరిభవమను । డానింబోనడఁప నేనదంటవని

కిదా। వానలదాహవిపత్తి। న్వానుచువాఁడెవఁడు మేఘమండ లిదక్కఁగ॥ (౩౪)

గీ॥ అంగజారియిట్టులాడిననింద్రాది। సురలుసమ్మదాశ్రు భరములైన। మోముదమ్ములందసామాన్యమగుచున్న। చా యదాల్చెరొకటసత్వరముగ॥ (౩౫)

క॥ ఈలీలఁబలికిగిరిశుఁడు। చాలించినయవసరమునశక్రుఁ డుపలుకుఁ। గాలోచితముగఁబలికిన। యాలపితముఫలసమృ ద్ధినమరుచుఁగాదే॥ (౩౬)

గీ॥ భూతనాయక శాశ్వతంబునుమహాప్ర। భారుచిరము నుసుతమోపహారియైన;జ్ఞానదీపంబుచేవతజ్మానభావి। భూ తములనెల్లనెఱుఁగుదువాతతముగ॥ (౩౭)

వ॥ అయిననువిన్నవించెదఁ జండదోర్దండ విక్రమక్రమ దూరీకృత ఘోరారాతియును సర్వగీర్వాణ గర్వాపహారకుం డునగు తారకుండు ముల్లోకంబులకు వల్లభుండై నాకలోకం బుకొల్లగొని మమ్ము వెళ్లందరిమి మఱియును విరించనువరంబు న దురంతపరాక్రముండగుటంజేసి త్రిజగజ్జయంబుగావింపంద లంచి నన్నుండొట్టి సురగణంబులఁ దృణంబుగగణించుచుండ సైరింపంజాలక యేము పితామహు దండకుంజని మెందుగ గొండాడిన నన్నలువ ప్రసన్నుండై యభవతనూభవుండు మీ కుంభృతనాపతియై యిన్నిశాటు గీటడంచునని యానతియొ సంగిన యనంతరం బీయమరు లమ్మహనీయు వచనమ్ము నెమ్మ నమ్ములనమ్మి యంతదాఁక నానిశిచరు పరాజయ వేదనయును

హృదయశల్యంబగు పరమేష్ఠివరదానంబునుగోరంబుగ సైరిం
చియున్నవారుగావున॥

క॥ దినకరతాపంబునఁగ్రాఁ। గినలతలకు మొయిలుభంగి
గిరికాముఁడశనీ। తనయుఁడగునీతఁడిఁకమా।కనిశమురక్షకుఁ
డుగాఁగనాజ్ఞయొసఁగవే॥ (౩౮)

క॥ మాకీతఁడు మొనగాఁడై। లోకమనశ్శల్యమగుఖలున్దా
రకునిన్। బోకార్చిన మాకుఁగల్గుమ। హాకష్టము లెల్లఁబాపు
నధీశాందుధరా॥ (౩౯)

క॥ ఘోరరణంబుననీదుకు। మారుఁడు నిశితాయుధము
లమాతుఁడరగళము। ల్వారకత్రుంపఁగవారిస। తీరుది తమ్ము
లదెసఁబ్రతిధ్వనిసలుపున్॥ (౪౦)

క॥ కలననితండలతారకు। బలిఁబ్రట్టున్నిజముధరణిభగవ
తికీవే। ల్పులుసనికారాగృహములఁ। గలఁగెడు సుందరులవే
ణికలువిడుతురిఁకన్॥ (౪౧)

గీ॥ ఇటులజంభాంతకుఁడువచియించినంత। నసురవరుమీఁ
దఁగోపించియమరవితతి। పైనిగరుణించి యాశూలపాణి మ
గుడ। నతనికిట్లనివచియించెఁజతురఫణితి॥ (౪౨)

క॥ పురుహూతముఖ్య నిర్జర। వరులారవినుండునా
దు వచనమ్మిశం। కరుఁడు సకుటంబముగమీ। రరసిన కా
ర్యములసజ్జుఁడై వర్తించున్॥ (౪౩)

క॥ మునునే నియతాత్ముఁడ నై। య్యును గౌరింబెండ్లియా

డి యుండెదనిపుడ । ప్పనికిఁదుతత్తనుజుఁడా । దనుజవరుం
గూల్చుటయెనిదానమ్మయ్యెన్॥ (౭౪)

గీ ॥ అర్హమగునిది మీరునాయాత్మజాతు । సైన్యపతి
గాఁగ నొనరించి చని మహోగ్రు । నసురుఁ గూల్తురు గాక
యీ యమరభర్త । మించివెండియుదివముఁబాలించుఁగాక॥

క ॥ ఆమృత్యుంజయుడిట్లని । యామర తతితోడ నుడివి
యాహవకుతుక । శ్రీమీఋ కుమారుంగని । యామనుజాదు
నిజయింపు మనివాక్రుచ్చెన్ ॥ (౭౬)

క ॥ శూలధరుశాసనముఁదలఁ। దాలిచిహైమవతిముద్దు
తనయుఁడుభక్తి । న్గారెఁబిత్పృభక్తి తత్పర । శీలురకి దెధమన్
మైప్రసిద్ధివహించున్॥ (౭౭)

క ॥ తనుజునిదనుజునితోదుర । మొనరింపుముపొమ్మటం
చునుగ్రుఁడు వలుకన్ । వినిగిరిజయుల రెసుతుమగ । తనమున
కున్వీరమాత దనరుంగాదే ॥ (౭౮)

మ ॥ అసురాంభోరుహ లోచనానయన విన్యస్తాంజనంబు
న్గడు । స్వసభంజించిజగత్త్రియాభయదుఁడై వెల్గొందువీర
వ్రజా । గ్రసరుంబ్రాధును మాకుమారుఁగొని వేద్కం బొం
దె నింద్రుండుమా । నసవీధిన్ ముదమందఁడే జనుఁడనూనం
బౌనిజేష్టాప్తికిన్ ॥ (౭౯)

గీ ॥ సురగణంబులు వెనువెంట నరుగఁదేర । గమనశాలా

హారమైన వేసముధరించి । పార్వతీనందనుఁడుతఁడ్రిపాదము
లకు । నలరఁ దలవంచి జోహారుసలిపెనపుడు ॥ (౫౦)

క ॥ వినతుఁడగు కొమరుతలమూ । రొక్కని రిపునింగెలి
చి పాదుకొల్పెము బలసూ । దనునకమరాధి పత్యం । బనిదీ
వనలన్మహేశుఁడలరిచెఁ దనయున్ ॥ (౫౧)

గీ ॥ శిరమున నాతఁడుగారి । చరణంబుల కెఱఁగ గారిస
మ్మదబాష్ప । పరిమిత వృష్టి నతనికి । న్పారఁబొరివీరాభిషే
కముంబచరించెన్ ॥ (౫౨)

వ॥ మరియును ॥

క ॥ కూరిమిపెంపున గిరిజా । సారస ముఖి యంకమం
దుఁజతురునిఁదనయుం । జేరిచియను నరిఁగూలిచి । శ్రీరాజిల
వీరమాతఁజేయుమునన్నన్ ॥ (౫౩)

వ॥ అనినవిని ॥

గీ ॥ క్రూర దైత్యాధి పవినాశకారణంబు । నతిత రాహ
వకుతుకుఁడాసుతుఁడుగట్టు । చూలిచేఁ దండ్రిచేవీడుకొలువడ
సి । యంతఁద్రి దివంబునకు నేగె సంతసమున ॥ (౫౪)

గీ ॥ వజ్రిమొదలగు జేజేలువరుసగట్టి । శూలపాణికి వలి
గట్టుచూలికప్పుడమరఁబ్రణమిల్లివలగొనికొమరుసామి । వెం
టనేగిరిగాటమావేడ్కతోడ ॥ (౫౫)

క ॥ ఆయత తేజోధరులై । యాయమరులు పోవఁబవటి
యందు నగగనం । బాయెడనల్లెడనుడుసము । దాయముచే
వ్యాప్తమగు విధమ్మున వెలిఁగెన్ ॥ (౫౬)

క ॥ వారేగు చుండ నడుమఁగు । మూరుఁడు వెలుఁగొంచె మింటమంజుల కాంతిఁ । దారా నక్షత్రగ్రహ । వారమునకు నడుమఁగు ముదబాంధవు పగిదిఁ ॥ (౫౭)

క ॥ వలిమల దౌహిత్రునితో । బలశాసనుఁ డొట్టివేల్పు బలగంబొచు ।క్కల తెరువుదాఁటిక్రన్ననఁ। బొలుపెసఁగన్నాక లోకమునకేగెనొగిఁ ॥ (౫౮)

గీ ॥ రక్కసునకును భీతిల్లి పెక్కుకాల । మునకు మగుడంగఁదారుగాంచిన స్వకీయ । లోకమును జేరఁగామదిలోన వెఱపుఁ।పాసఁగ సురలెల్లనిము సంబుమ సలిరపుడు ॥(౫౯)

గీ ॥ నీవు ముందేగ వలయును నేనుపోవ । నీవె పొమ్మన్నచోఁ బొమ్మునీవె మొదల । ననుచు వెఱఁజెంది స్వర్గపత్తనముఁజేరు । వేలుపులకెల్ల గలహంబు గ్రాలెనపుడు ॥ (౬౦)

చ ॥ తలకొనియప్డుస్వర్గపురదర్శన కౌతుకముప్పతిల్లఁగా । నలఘువికాస భాసురదృగంబుజులైయలవేల్పులెల్లను। జ్వలతరకార్తికేయము ఖపద్మములందరిభీతికాతరాం।తలలిత మైనదృష్టిని ఘనమ్ముగఁజేర్చిరి చేరి యొక్కటఁ ॥ (౬౧)

ఉ । అంతమహేశు ముద్దుకొడు కాస్యములంజెఱునవ్వ గ్రమ్మన । త్యంతవిలాస మొప్పఁగసురాళికిఁదానుపు రోగముందుగా । స్వాంతమునందలంచుచువిపత్తునుపస్థితిఁగోరిదేవత। ల్సంతసమందునట్టులతిచాతురి మీఱవచించె నీగతిఁ॥ (౬౨)

చ । వలవదు సాధ్వసంబిఁక సుపర్వగణాధిపులార మీరు

బ॥ ల్చెలువుగ నేగియందఱునుజెచ్చెర స్వర్గముఁజేరుఁడిం
తక। త్యలఘుపరాక్రమంబున మహా పదలన్నిముఁ దార్చినట్టి
యా।ఖలుఁడసురాధిపుండిటకెకానఁగవచ్చునుగాకనాకిఁక ॥

గీ॥ ఘోరభుజములస్వర్లక్ష్మికొప్పుఁబట్టి।యెవ్వఁడీడ్చె
నొముస్న బల్లాఁ-వ్వచేత। నిపుడు మామకనారాచ బృం
దమెల్ల। నతని రక్తంబుఁ దనివారనానఁగలదు॥ (౬౪)

గీ॥ అనిన మోఘప్రచారంబు నధికసార।మాది తేజః।
ప్రసారమానాదుశక్తి। స్వర్గలక్ష్మికిఁ గడ గండ్లఁబాఱఁదోలి।
యరిశిరముద్రించిమీకెల్ల హర్షమొసఁగు॥ (౬౫).

వ॥ అనిన॥

గీ॥ తారకాసురువధియింపఁదలఁచినట్టి। గట్టురాపట్టిము
ద్దులపట్టిపల్కు।విని మొగములందుఁజిఱునవ్వువెలయుచుండఁ।
త్రిదశులెల్లనుబలువేడ్కఁబొదలిరపుడు॥ (౬౬)

శా॥ చాలన్వేడుకచేతసారెఁబులకల్పించద్గతిన్గాౢలఁగా।
నాలోఁగన్నులువేయు మేననువికాసాత్తంబులై రాజిలఁ।బౌ
లోమీపతి యాత్మవస్త్రమున నాభగోల్లసత్పుత్రుసై। చే
లంబుంబరివర్తనంబువిరచించెందత్ప్రమాణంబుగఁ॥ (౬౭)

శా॥ ఆనందాశ్రుతతరంగితాంబకము లత్యంతప్రభాపూర
ముల్। జూసైయొప్పెదు నాల్గుమోములనుబ్రహ్మావృద్ధుఁడౌ
నల్లవా। ణీనాధుండతికాంతిమంజుల భవానీపుత్రునాస్యంబు
ల। న్బినప్రీతివిచిత్రమారఁగనుజుంబించెన్దగన్వేడుకఁ (౬౮)

గీ॥ అలరిగంధర్వసిద్ధవిద్యాధరాళి। మేలుమేలనికొండా

డిశూలికోడుకు । జయజయత్వంమహోదగ్రశౌర్యయనుచుఁ।
బలికియలరించిరెంతేని చెలువమెసఁగ ॥ (౬౯)

క ॥ తారకుఁజంపంగలుగుకు । మారుఁబొగడి నారదా
దిమౌనులుతమబం । గారంపువసనములఁ బైను । కోరికచెలు
వారమాఱ్చికొనిరావేళ ॥ (౭౦)

క ॥ ఆసర్వజ్ఞకుమారుని । బాసటగొనిసురలుపీతభయు
లై దివికి । నోసమకట్టిరియూధపు । బాసటచేఁ గుంజరము
లువనికింబోలె ॥ (౭౧)

క ॥ తారకుగెలువంబోవుకు । మారునివెనువెంటఁజనిర
మర్త్యులునేడ్క । న్వారక పురములఁగాల్పం । గోరినవారు
వెంటఁబ్రమథకోటులుపోలె ॥ (౭౨)

క ॥ ఉడుగకకడిగినజేజే । పడఁతుల మైపూఁతఁబీతవర్ణో
దకమై । కడునెగడువేల్పుటేఱు । య్యెడఁజూచిరి ప్రోలదివి
జులెల్లన్వేడ్క ॥ (73)

క ॥ జలకేళిమెలఁగుదిగ్గజ । ముల కరఘాతములఁబోడ
ముస్ఫుటపీచికల । న్గలిఁదీరవృక్షములపా । దులఁదడుపుచు
నున్నస్వర్గధునిఁగాంచిరొగి ॥ (౭౪)

గీ ॥ వేల్పుకన్నియలాటాడువేళఁగనక । సికతమాణిక్య
గర్భముల్చేసిమిఁకుల । నున్నతంబుగఁదమయంతఁబన్నినట్టి।
తిన్నియలతోడితీరంబువన్నెమెఱయ ॥ (౭౫)

సీ ॥ పరిమళలాలసభ్రమరగానములు మరాళికాకేళికా

లోలములును । నగుపై(డితమ్ములనొగిరాలుపుప్పొడిఁబరిపీత
నీరమైపరఁగుదానిఁ । గౌతుకంబునఁజూడఁగావచ్చివేలుపుసె
లఁతలుగట్టునవిలిచియుండ । వితతతద్వీచికాప్రతిబింబములచే
తనేగువారికిముదమిచ్చుదాని । నధికచిరదృష్టమగుదానినమ
రగంగ । నపుడుదర్శించియింద్రుండు హర్షమంది । ముం
దునేగుచుఁగడుమైత్రినందియున్న । స్కందునకుఁజూపెనతిభ
క్తిగౌరవముల ॥ (౭౬)

క ॥ వేలుపుటెల్లంగొలువఁగ ।ప్రోలన్నునుచూడనట్టిము
ఖ్యసురనది । నైల్వశమ కనిశరజన్ముం ; డాలోసోల్లాస నయ
నుఁడైయుప్పారెన్ ॥ (౭౭)

క ॥ చేరంజనిశరజన్ముఁడు । చేరువఁగయిదోయి మౌళిఁ
జేరిచియమరు। ల్నారెకునుసన్నుతించెడు । సారనదిన్బొగడి
వినతిసల్పెన్స్వేచ్ఛన్ ॥ (౭౮)

గీ ॥ కంపితానూనపరిమళకమలరాజి । విపులసంశ్లేషప
రిమిళద్వివిధవీచి । విమలసుకపోలవిలసితస్వేదహారి । సురన
దీవాయువయ్యుమాసుతుభజించె ॥ (౭౯)

గీ ॥ అవలనేగుచు శరజన్ముఁడగ్రభూమి । నింద్రులీలావ
నంబగునందనమ్ము । భిన్నభగ్నోద్ధృతానేక విటపియగుచు ।
నుండుదానినిదిలకించెదండఁజేరి ॥ (౮౦)

క ॥ ఆతారకుపరుసఁపుం । జేఁతలచేనీవనంబుచెడియెన
టంచున్ । వేతాప్రమలోచనుండై । యాతఁడు భూభ్రింగభీ
షణాననుఁడయ్యెన్ ॥ (౮౧)

గీ॥ చాలఁ భిన్నోపవనముదుశ్చరవిమాన । సరణియును నాశితాశేషసౌధనివహ । మఖిలభువనోత్తమంబునై యమరు నట్టి । స్వర్గనగరంబునీక్షించె సక్కఁడపుడు ॥ (౮౨)

క॥ అరులెల్లవెతలఁ బెట్టఁగ । సిరిచెడి బలుకష్టదశను జెందినకతన । న్వరునింబుత్రులఁ బాసిన । తరుణింబురుడించు స్వర్గధామముఁ జూచెన్ ॥ (౮౩)

క॥ ఖలుఁడగుదైవత రిపుపై । నలిగి యతండసురు వేగ నాజింగూల్పం । దలఁచుచు నభయుంజై వే । ల్పులతోడం గూడిస్వర్గపురముం జేరెన్ ॥ (౮౪)

ఉ॥ అంతటదైత్యనాథమదహస్తిరదాహతినిత్యదారితా । శ్యాంతరమైఘనంబుగ మహాభుజగాధిపకంచుకాళి న । క్రాంతమునిండియున్న పృథుజాలము లొప్పెడు జంభభిత్పురా । భ్యంతరహర్మ్యరాజిగని యంధకవైరిసుతుండు చింతిలెన్ ॥

సీ॥ బహిరున్నతన్యస్తభర్మవారిజములులలిత దిగ్గజమదకలుషములును । విమలహేమమరాళసముదయ హీనము ల్పాటితవైదూర్యపటలములును । బహువిధసంభవ ద్వ్యాలత్పాణంబులౌ స్వర్ణగరీగృహావాపికలను । బగఁజేసైనచేష్టాటు నారసిశూలితనయుఁ డద్భుతవిషాదములనొందె । బలరిపుండరికరిదంతదళితకుడ్య । విమలలూతాలసత్తంతువితతిపూర్ణ । జాలమగువైజయంతసంజ్ఞస్వసౌధ । మందునతిభక్తిఁ జేరిచె సక్కఁడునపుడు ॥ (౮౬)

క ॥ సురపతి త్రోవం జూపఁగ । సురలెల్లన్వెంటరాఁగ సుం
దరరతోన్ । తక్కరరుచిసోపానలస । త్సరణింజని స్కందుడిం
ద్రుసౌధముఁ జేరెన్ ॥ (౮౭)

గీ ॥ చారుకల్పకభూరుహ తోరణంబు । పారిజాత సు
మాలికాపూరితంబు । వివిధ దేవర్షిమంగళప్రవచనంబు । నా
గతాంగనమగుసౌధమతఁడుస్సెరె ॥ (౮౮)

చ ॥ స్థిరముగ దేవదైత్యుల సృజించి మహామహిమ ప్రగ
ల్భుఁడై । పరఁగినకశ్యపాఖ్యమునిపాదసరోజయుగంబుఁగాంచి
త। త్వరమతితోడ వానికిఁ బ్రదక్షిణముం బచరించిమించిన ।
ట్చిరములువంచివందనముఁ జేసెనుమానుకుమారుఁడత్తఱిన్ ॥

క ॥ వేలుపులతల్లికశ్యపు । నాలునునగునట్టి యదితి య
మగులనెంతే । లీలనువలగొని వినయము । గ్రాలంగనమస్క
రించె స్కందుండురహిన్ ॥ (౯౦)

క ॥ మూనకజగములగెల్చిన । వానింజెట్టెదుని దేవవైరి
నిగలన । న్నోనడఁచునట్టియాశీ । ర్దానంబులఁ గార్తికేయుఁ
దనిపిరివారల్ ॥ (౯౧)

క ॥ తనుఁజూడఁగవచ్చినసుర । వనితల కయ్యదితితోడి
వారికినాతం । డెనయఁగ మ్రొక్కిన నెయ్యం । బునవారును
దీవనలను బొదలిచిరతనిన్ ॥ (౯౨)

క ॥ వేలుపురాయనియమ్మిలి । యాలైనపులోమపుత్రి
కాతఁడుమ్రొక్కం । గాలలినాసతి యదితిం । బోలిమొగిం
దీవనలును బొదలిచెనతనిన్ ॥ (౯౩)

గీ ॥ అంతఁగశ్యపుత్రిక్కనయాంద్రుసప్త । మాతలేడ్తురఁ
బ్రీతిసమేతలగుచు । గ్రక్కునను వచ్చి కడుభక్తి మ్రొక్కుకొ
మరు । సామికొసఁగిరి మంగళాశాసనములు । (౯౪)

మ ॥ అమరాధీశుఁడు లోనుగాఁగలయమర్త్యగ్రామణు
ల్గూడిబ । ల్ప్రమదం బందుచు వేడుకం బొదలుశర్వాణీసుతుం
జేరియీ । సమయం బేశుభదంబటంచునుమహాసైన్యాధిపత్యం
బునం । దమరంగానభిషిక్తుఁ జేసిరతనిన్సూర్యతుశౌర్యాధికున్ ॥

గీ ॥ ప్రాప్తనిర్జరసైన్యాధి పత్యుఁడైన । భూరితరవీర్య
నాశూలిపుత్రుఁ గాంచి । శత్రువిజయంబు గణియించిసమయ
మెంచి । విబుధసముదయమావేళ వెతఁద్యజించె ॥ (౯౬)

చ ॥ దురమొనరించు కౌతుకముతో విజయంబును గో
రుచున్నయీ । శ్వరుని కుమారుఁడప్పుడు సుపర్వగణంబుల
తోడఁ గూడిభీ । కరుఁడగు తారకాసురున ఖండిత విక్రము
నాత్మశత్రువే । గిరమ హఠమ్మున న్యమునిగేహముఁ జేరుపఁ
బూనెనుగ్రుఁడై ॥ (౯౭)

చ ॥ అతఁడొగి జెట్టిదంపు విలునద్భుతశక్తియుఁ బూ
నిమానియై । యతులము దుర్నివారము మనోధిక వేగము
గెల్పులచ్చికా । యతనముదుస్సహంబు నమరారుల కెల్ల మ
హాభయంకరా । కృతియు విజిత్వరాఖ్యమగు నిద్ధశతాంగము
నెక్కె గ్రక్కునన్ ॥ (౯౮)

గీ ॥ తాల్చెనతనికి నొకఁ డరిదారణంబు । భవ్యస్వల
క్ష్మి కాపన్నివారణంబుఁ । దారకశ్రీవినాశనకారణంబుఁ । జా
రుచామీకరాతపవారణంబు ॥ (౯౯)

క ॥ తలపైనిందు కరద్యుతి । వెలిఁగెడు బలుచామరము
ల వీవఁగనెదుట । న్నెలఁగెడు సిద్ధులు కిన్నరు । లలరఁగనుతి
యించిరతనినాహవదక్షుల్ ॥ (౧౦౦)

ఉ ॥ వేదుకపెల్లున్నమనవేళకు నొప్పిన వేషమున్నడు । న్నా
డినిసర్వపర్వత పతత్రములూడ్చిన వాలుఁబూనిబ । లొప్పెడి
మిరాజతాచలముఁ బోలినవేలుపు గారునెక్కి-యా । నాఁడె
సురేంద్రుఁ డయ్యభవనందను వెంబడి నేగెనుద్ధతిన్ ॥ (౧౦౧)

ఉ ॥ నేఁడిదెవేళయంచు నవనీధరశృంగ సమాన మైన
యా । యేడిక నెక్కి మార్తురఁ పయింజనియించిన కోపవ
హ్నిలోఁ । గాఁడఁగ సారెసారెకధికంబుగ మండుచునుగ్ర తే
జము । న్నూడినయాయుధంబుఁ గొనిగొబ్బుననగ్నియునేగవెం
బడిన్ ॥ (౧౦౨)

ఉ ॥ సారమహేంద్రనీల గిరిసన్నిభమై తగుదాని శృంగ
వి । స్తార విభిన్నవారిధరసంచయమైలలినొప్పుదానినా । సై
రిభవాహనంబుఁగడు సంతసమారఁగనెక్కి-దండమొ । ప్పా
రఁగఁదాల్చియయ్యెడఁ గృతాంతుఁడువెల్వడె వారివెంబడిన్॥

ఉ ॥ ఆతఱి రాక్షసాధిపతియై తగునైరృతుఁ డాత్మవైరి
సం । ఘాతము మీఁదియొంటమిని గ్రక్కున దారుణుఁడై మ
హామద । ప్రేతము నెక్కి-యుక్కు-ఁగడుఁబీరముఁ గ్రోధము నొ
ప్పనంధకా । రాతితనూజుతోడఁ జనెరక్కసులెల్లను దన్నుఁ
గొల్వఁగన్ ॥ (౧౦౪)

చ ॥ ప్రకట వినూతనాంబుదము భంగిభయంకర రూప

మై జగ । న్నికరమునందు నెక్కుడగు నిస్తులదేహముఁదాల్చి
యున్నయా । మకరము నెక్కి శాత్రవుని మార్గణఁబాశ
ముఁ గేలఁబూనికొం । కకచనె నామ హేశ్వరుని గాదిలిపుత్రు
ని వెంటఁబాశియుణ్ ॥ (౧౦౫)

ఉ ॥ దిక్కులునాకసంబు నొక తేపనెదాఁటఁగనోపుదానిఁ
బే । రుక్కున మీఱుదానిఁగడునుగ్రజవంబగుదాని లీలమైని
క్కుమృగంబు నెక్కి యవినింద్యరణోత్సవ కౌతుకంబుచే ।
గ్రక్కునమారుతుండరిగెఁ గామవిరోధి కుమారు వెంబడిణ్ ॥

చ ॥ రమణఁగు బేరుఁడయ్యరులరక్తముఁగ్రోలె డఁదానిస
ద్బ్రహ । త్తమమగు నుజ్జ్వలద్గదను దాలిచి మానవు మీఁద
నెక్కి వి । క్రమమున యుద్ధవారిధివి గాహమొనర్పఁగఁబూ
నిదానికై ; యమరఁగ నేగుస్కందునకు నప్పుడు వేగసహా
యుఁడై చనెణ్ ॥ (౧౦౭)

చ ॥ భుజగవరేణ్య బద్ధవరభూరిజటాపటలుగ్రముజ్జ్వల।
త్రిజగ దనూనశీలిక్ర దరిందమ శూలధరుల్లయేచ్ఛచే । నజ
గవ పాణులై పరఁగునందఱురుద్రులునాల పోఁతుల । న్వృ
జవత నెక్కియేగిరలపార్వతినందనువెంటనొక్కటణ్ ॥ (౧౦౮)

చ । ఉరువడి లాఁతివేల్పులు రణోత్సవకేళి కుతూహలం
బునం । బరులను బాఱఁదోలఁ బ్రథమాన నిజోత్తమ వాహ
నంబుల । న్వరుసగ నెక్కి నిక్కి ముఖవారిజము ల్వికసిల్లు
చుండ వా । రరిగిరి కార్తికేయునకు నాజని దోడ్పడఁ గోరి
యుంకఁ ॥ (౧౦౯)

సీ ॥ హాటక కేతన యష్టి సంకులములు నానావిధచ్ఛత్ర మానితములు । ఘనతరస్యందన ధ్వని భయంకరములు గజ ఘంటి కారవ కలకలములు । జ్వలదాయుధ ప్రభావళిసముల్ల సితదిగ్వల యనభోంతరస్థలములై న।విబుధసేనలు తనవెంటనే తేరంగశూలిపుత్రుఁడు రణకేళి కరిగె ।నపుడుకోలాహలంబు లనమరవరులు। భటులువోవంగఁ దధ్వజవ్రజముచేత। నంతర ములేని దిక్పాలియాకసంబు। నవనియుచ్ఛ్వాసరహితమైన ట్లులుండె ॥ (౧౧౦)

చ ॥ అడరు సురారి సంపదల నావలఁ దోలఁగఁ గారణం బులై । కడలను జొట్టుకొండలలిఁగల్గు ప్రతిధ్వని మేదురంబు లై । బడలక నం బరాంతమునఁబర్విని తాంత ఘనంబు తాచు చును । బ్బౌడిపటహ ప్రణాదములు పెల్లుగనెల్లెడ మ్రోసెన య్యెడన్ ॥ (౧౧౧)

గీ ॥ బలముధూళి నింగి గలఁగెననరగను ।దరుచునాటికడ లి ధ్వని జయించి ।దైత్యయువతిగర్భదళనఁబుఁ గావించు । పటహనాదముననభంబు మొరసె ॥ (౧౧౨)

పంచచామరము ॥ శతాంగ సత్తురంగ మప్రచార వేళజా తమై।తతంబుగాగ జేంద్ర కర్ణతాళ తాడితంబునై । పతాకి కాధు తంబునత్ప్ర భంజ నాహతంబును। గ్రతత్సు మేదుధూ ళి మిన్నుఁ బ్రాఁకెనక్రమంబుగన్ ॥ (౧౧౩)

క ॥ తేరులమావుల గొరిజల । చేరేఁగును పత్యకల

పసిండిరజముడి । క్ష్వారముల మొరయుచున్న స । మీరణాము
లచేఁగదున్నఁ బ్రిమించెన్నడిగని ॥ (౧౧౪)

గీ ॥ ప్రబలిస్ఫై న్యోత్థితంబగు పసిఁడిధూళి । క్రిందనీఁదను
పఁతియును ముందు వెనుక । నెల్ల కడలను దళములంచెల్లఁ బ
ర్వ । బాలభానునినిర్ద్దంపు డాలుఁ గొనియె ॥ (౧౧౫)

గీ ॥ బలముపలనఁ బొడము పసిఁడిదు దూరమ్ము । గడల
యందుమింటఁ గలయఁబర్వ । వెసనకాలసంధ్యఁబింగళంబగు
చున్న । మేఘ పటలియట్లు మెఱసెనపుడు ॥ (౧౧౬)

చ ॥ చనునెడనేనుఁగు ల్వ్రాస నిజప్రతిబింబను హేమభూ
మిలో । ననుపమరీతి తోడ నెదురైనటు లుండఁగఁ గాంచి
మాపతా । శనభువనాగతంబయినసామజరాజ మటంచునెం
చియు । డక్కనఁ దమదీర్ఘదంతములఁ గొట్టెనుసెట్టనఁ గోప
మారఁగని ॥ (౧౧౭)

ఉ ॥ గ్రక్కునరక్తచూర్ణకపరాగము చేతను బింజరం
బులై । తక్కకనల్లనల్లఁజనుదైవతసైన్యగజంబులెల్లఁ దా । ర
క్కడ హేమభూధరసమంచిత భూములనాత్మబింబమే । చ
క్కటిసైనఁ గన్గొనఁగఁ జాలవునాఁడు మహోద్భుతంబుగని ॥

క ॥ ఈలీలనమరవాహిని । యాలపుసంగ్రమునసోలలా
డెడుకోర్కి । న్గోలాహలముఖరితగుహా । యైలలితసుమేరుశై
ల మప్పుడు డిగియెని ॥ (౧౧౮)

క ॥ అరదములరవళిచేత । న్దరదేంద్ర కరీంద్రబృంహితం

బులచేన్నా। గిరిగుహాల నత్తమిల్లిన । హరులవి సుఖనిద్ర విడు
వవఘ్యోన్నాఁడుఁ ॥ (౧౨౦)

ఉ ॥ ఎల్లగుహాంతరంబుల రహించు ప్రతిధ్వనిమేదురంబు
లై । పెల్లు భయంకరంబు లగుభేరిరవంబుల చేతనైననుత్స్ఫు
ల్ల మహారథప్రకర దుర్దమనాదము చేతనైననాఁ। డల్లహరు
ల్చలింప మిమృగాధిప నామము సార్థకమైతగెఁ ॥ (౧౨౧)

ఉ ॥ అట్టిటునేగి గట్టులగుహా ల్విదళించెడు రీతిసేనల।న్చ
ట్టు మహారవంబులు ప్రభూతములై దెసలంముఁబర్వ చో।ని
ట్టలమైనశక్తినిమృగేంద్రములైన కతంబుచేతనా। చుట్టులను
న్నసింగములు సుస్థిరగర్వముఁబూనెనాయెడఁ ॥ (౧౨౨)

గీ ॥ సకల మృగము లమర సైన్య సంఘర్షణ। భయ
ముచేతఁదప్పపాఱిపోయె। గుహలనుండి వెలికిఁ గొంకకచను
దెంచి। నిలిచెనందె సింగములు దిటమున ॥ (౧౨౩)

క ॥ కుతుకము వెలయఁగనమరా। వలిజనములచే తఁజూ
డఁ బడెడుబలంబు। ల్తతమగు సుమేరు నికట। క్షితి నెంత
యు దవ్వగాఁగఁ జేరెన్సొరిదిఁ ॥ (౧౨౪)

గీ ॥ పీతనీలరక్త విశదవర్ణంబగు। మేరుధాతుధూళిసే
రనభము। కడఁకయింతలేని గంధర్వ నగరంబు। శోభ చేత
మిగుల సొంపుఁదాల్చె ॥ (౧౨౫)

ఉ ॥ మాటికిదేవతాబలవిమర్దమునం జనియించి మొం
తయు। న్నాటముగాఁగఁ బ్రాణితతి కర్ణవిదారక మా రవం
బుపె। ల్లోటమిలేక త్రచ్చెడు సుధోదధినాదము కన్నమిన్న

యు । న్బాటితనాకమై ఘనపంక్తులఁ బర్వె నఖండవైఖరిన్ ॥

క ॥ చటులకరిఘీంకృతులు హరి । పటలోద్భటహేషితములు భద్రరథాంగో । త్కటనినదంబులు చెలఁగినఁ । బటహాని నాదంబు వినఁగఁ బడదయ్యె నొగిన్ ॥ (౧౨౮)

ఉ ॥ కప్పిన దేవసైన్యమునఁ గ్లురజంబసురాంగ నాళి కిం । గొప్పుల బక్ష్మపంక్తులను గుబ్బకుచంబులయందు వెండి యు । న్గొప్పధ్వజంబులందుఁ గరికోటులఁ దేరుల ఘోటకాళి పై । నప్పుడు నిల్చె వారల ప్రయాణవిచిత్రము లెన్న శక్యమే ॥

చ ॥ పెరిగిభరంబుగాఁ దపనబింబముఁ గప్పిన దేవవాహినీ । స్ఫురితమహారజంబునను బూరితమైననభంబుఁ గాంచి ఖా । సురజలదంబటంచు నొగి క్షోణిత్యజించి మరాళరాజితా । నరిగె నమానసంబునకు నష్టమయూరము లాడె వేడుకన్ ॥ (౧౨౯)

గీ ॥ క్రొత్తమేఘంబు సవతుఁ జేకొనుచునున్న । వేలుపులదండు రజమేగి విన్నుఁ గ్రాఁకఁ । బొడవులై యున్న జాళువాపడగ లెల్ల । మించుమించులచందాన మెఱసె నపుడు ॥ (౧౩౦)

గీ ॥ వేలుపులసేనఁ బొడమి నధూళిచేతఁ । దద్దనిండిన భూనభోంతరముఁ గాంచి । యెగువనుండియుదిగువకో దిగువ నుండి । యెగువకో యేగుననిలోకమెంచె రజము ॥ (౧౩౧)

గీ ॥ సకలచేతనదృష్టిప్రసారమప్పుడు । సైన్యమునఁ బుట్టి గాఢరజంబుచేత । నెగువ చక్కి నిదిగువను నెదుట వెనుకఁ గె । లఁకులందు నులలినడ్డగింపఁబడియె ॥ (౧౩౨)

ఉ ॥ ఆ యెడ నాకసంబు కకుబంత గజోత్కట దానహారులై । పోయి విమానకంఠపరిపూర్ణ ప్రతిశ్వని మేదురంబులై ।

పాయక గొప్పలౌ వివిధ వాద్యరవంబుల చేతసారెకు । న్గయని
మ్రోఁగ సాగరధర ణింగలవారలుచోద్యమందఁగన్॥ (౧౩౩)

ఉ॥ భూమికిడిగ్గి జీవబలము ల్రయమారఁగ ధాత్రిభాగ
మం । దామెయి నెందు నేనిమడ కయ్యెడ సర్వగణముఁ జేరియం
దుల । న్దిమస మొప్పఁగా నరసి నిభ రమైయది యుంటఁగాం
చిబ । ల్బాములఁ జెంది కుందివెసఁ బర్విడెనప్పు డొకింతద
వ్వుగన్॥ (౧౩౪)

గీ॥ పెచ్చుపెరిగినగజరాజ బృంహితముల । హెచ్చులైన
ట్టిమావుల హేషితములఁ । జటులరథనేమిరవముల జగము శ్రావ
ణ । హీనమైనట్టులాకులంబైనదయ్యె॥ (౧౩౫)

క॥ కరిగర్జితములఁ జంచల । తరఘంటానాదములను
జద్వీరరవో । త్కరములచే దెసలన్నియు । నరుదుగ గీపెట్టఁదొ
డఁగెనాసమయమునన్॥ (౧౩౬)

క॥ వారణమదములచేఁ బెను । పారంగను విండి ఘోటకా
హతధూళి । న్వారకపంకిలములునై । యారథముల చేత మెట్ట
లైనదులొప్పెన్॥ (౧౩౭)

గీ॥ సకలఘోటకఖుర పతితములగుచు । స్యందనానేకప
ముల చేసమములగుచుఁ । బల్లములు మెట్టలయ్యె నందెల్లయెడ
ల । నటుల మెట్టలు పల్లంబులయ్యె సారిది॥ (౧౩౮)

ఉ॥ దిక్కులనాకసంబునఁబ్ర తిధ్వనికల్గి భయంకరంబు
లై । గ్రక్కున నద్రిసానువుల బ్రక్కలు వాఁడఁగఁ బల్వలంబులై ।
త్రెక్కక యెల్లసంద్రములఁ దద్దయుఁ గంపిలఁ జేయునట్లుగా । చ
క్కటి భేరిభాంకృతుల సర్వజగంబు గలంగెనయ్యెడన్॥ (౧౩౯)

గీ॥ గాలిచేనిట్టునట్టును గంపితములుఁ । గడలనీరంధ్రగ
తులునై కరము మెరయు। సొగసుగజ్జెలకేతనాంశుకములంబ।
రంబుఁగప్పరజస్సాగరమునఁద్రుంగె॥ (౧౪౦)

మ॥ ఘనసంత్రాసదమత్తకుంజరఘటా ఘంటానినాదం
బులు । స్వనధిధ్వానముభంగిఁబిట్టిదములై వ్యాపించుతద్దీఁక్రొ
తు । ల్వెనుపారందెసలందుఁబర్వి నభము న్భేదించుచో నాయె
డ । న్విన రావయ్యెను వాహినీపటహస న్నిస్వానము లట్రి
మ్మఱన్ ॥ (౧౪౧)

చ॥ తలఁగక సైన్యనాదజని తధ్వనిబిట్టుగఁ దన్ముఖంబులం।
దలరరజఃప్రపూరితన దంబరతౌచురజస్వలాత్వము । న్గలయఁ
గనొందుదిక్కులను గన్గొనిపద్మహితుండు గ్రక్కున । న్జెలఁగు
రజోంధకారములచేతఁదిరోహితుఁడయ్యెనయ్యెడన్ ॥(౧౪౨)

మ॥ అనఘానూన మహేంద్రసైనికులచే నాక్రాంతయై
యే క్షిర । న్ఘనభీమాకృతియౌ నభోరజముచే సందుష్టయౌన
ట్టిది । గ్వనితారత్నము భేరికారవప్రతి ధ్వానంబుచేసారెకు।
ఘనరోషంబునఁజొలెనద్భుతముగా గర్జిల్లెనొక్కమ్మడిన్॥

గీ॥ గాలినెంతయుఁదూలిననట్లపగిది।గారులన్నియుగగనం
బుభూరివారి । దంబులనుబోలియురిదముల్దరణిఁజేర । నదివిన
తణంబుచందాననయ్యెనపుడు॥ (౧౪౪)

ఉ॥ ధీరతరంబులై నపాలఁదిండిదళంబులనెల్లఁగూల్చఁగా।
బారములేకపొంగికడు భైరవనాదములై స్వవారిలో । వాటక
బ్రింగుభూమిధర వగిణముగల్గిచెలంగునయ్యకూ । పారము
లట్టులాయమర వాహినులెల్లెడనిండె మోడఃగన్ ॥ (౧౪౫)

క॥ శ్రీవాణీసమలంకృతి। భూవదనాంభోజసుకవిఘ్న్యాత్మీ
తిరు। డ్భావుకఫల దళితధరి। శ్రీవరఖరచాప ముద్దుకృష్ణమ
హీపా॥ (౧౪౬)

వంశస్థము॥ మనోజ్ఞసర్వజ్ఞకుమారయాచరా। ట్తనూజ
లక్ష్మీవనితామనోహరా। పినాకిపాదాబ్జనివిష్టమానసా। యు
నూనధర్మార్థచరత్నైకలాలసా॥ (౧౪౭)

గద్యము॥ ఇది శ్రీముకుంద చరణారవింద వందనానందమ
రందతుందిల మానసేందిందిరుండును శ్రీమన్ముద్దుకృష్ణధ
రాపురందర నిరంతర విశ్రాణిత వివిధమణి కనకభూ
షణ సదంబరాలంకార మహాగ్రహారాది సముపభో
గసంజాతప్రమోదసుందరుండున శేష భాషా శేష
సారస్వత శేష శాస్త్రప్రియ చ్ఛాత్రుండును
బిరుదరాజకులకలశాంభోధి రాకాశశాంక
వేంకటాద్రిరాజపాత్రుండును జెంగల్వరా
జకవిరాజసుపుత్రుండు నుభయభాషా.
భూషణుండునురసికతోషణుండును
సుకవివిధేయుండునగు శేషాద్రినా
మధేయుండు విరచించిన కు
మారసంభవకావ్యంబునం
బంచమాశ్వాసము.
శ్రీమదాంధ్ర కుమారసంభవకావ్యంబునం
బంచమాశ్వాసము
సమాప్తము.

శ్రీరస్తు

# శ్రీమదాంధ్రకుమారసంభవము

## షష్ఠాశ్వాసము.

క॥ శ్రీవేంకటేశపదస । వావర్జితపుణ్యగుణసమంచితల
క్ష్మీ। దేవీజీవితనాయక। శ్రీవాసవసదృశముద్దుకృష్ణమహీశా॥

వ॥ అవధరింపు మనంతర కథాసంధర్భంబెట్టిదనిన॥

చ॥ పగఁగొనిబాసవాల్దారదివాకరతేజుహరాత్మజాతుఁ
జే। వగలుగుసేనకెల్లదళ వాయినిగానొనరించి మించిబ। ల్మ
గఁటిమివేలుపుల్గొలువ మార్కొనవచ్చెనటంచుమానసం।బ
గలుచుకింవదంతియమ రారులమ్రోలజనించెనబ్రమై॥ (౨)

చ॥ జయకుతుకంబునన్విబుధ సైన్యములన్నియుఁగూడి
తోడ్పడన్। జయకమలాశ్రితుండగుచు సైన్యపతిత్వము నొం
దియెంతయు। న్నయముననేగుదెంచెడు పినాకితనూభవునాల
కించిపె। న్భయముననాశరవ్రజము భావములందుఁ గలంగెన
య్యెడన్॥ (3)

ఉ॥ ఆయసురప్రవీరులపుడాత్మవిభుండగుతారకాసురుం।
డాయఁగ నేగుదెంచిమకుటంబులఁగేల్గవఁ జేర్చిమ్రొక్కియు।
క్కాయజవైరిపట్టిఁగొని కయ్యముఁజేయఁగఁబూని నేఁడుజే।
జేయొకిమీఁదువచ్చెనని చెప్పిరిదెప్పరముప్పతిల్లఁగన్॥ (౪)

వ॥ అంతఁదారకుండు॥

చ॥ మునుమిడిమున్నకయ్యమునమూఁడుజగంబులనోర్చి

వానిచేఁ| బనిఁగొనుచున్న నన్నె దిరిప ల్లటుభీతిలిపాఱినట్టియా|
యనిమిషనాయకుండిపుడ హంకృతినీశకుమారుబల్మిచే| నను
గెలుచున్నిజంబనుచు నవ్వెనుదారకుఁడబ్రమారఁగన్| (౫)

ఉ || అంతటఁగిన్కచేఁ జదవియల్లలనాడఁగముజ్జగంబు|
ల | న్నంతముతోడఁ గెల్వఁగమనంబుననెంచి యతండుదర్ప|
దు | ర్దాంతులఁజండబాహుబల దారుణమూర్తులసైన్యనా
థుల | న్వింతగనుద్యమింపుఁడని వేగమ యానతి యిచ్చెనాజి
కిన్ || (౬)

క || అనవిని మొనగాండ్రందఱు | ననికై సమకట్టియుద్ధ
తా యుధులగుచున్ | వినతన్నృపసంతులంబగు | దనుజునిచ
త్వరము చెంతఁదగనిల్చిరొగిన్ || (౭)

మ || ప్రణతుల్సేయుచు ద్వారపాలకుఁడు చూపంగన్ని
జాగ్రంబునన్ | వినుతుల్సేసెడి వారిదోర్బల మహాభీలాత్ముల
న్సంగరం | బనువారాశిఁ గలంపఁగానొగి మహాహంకారు
లావారిన | మ్మొనగాండ్రన్ దిలకించెఁ దారకుఁడు సమ్మోదం
బుసంధిల్లఁగన్ || (౮)

వ || మఱియును ||

శా | ఆదైత్యాగ్రణియింద్రుదోర్బలము మాయుంజేయఁ
గాఁజాలి ది | గ్వేదండస్వనదానముల్సేయుచు నాభీలాత్మని
ర్ఘోషమై | యాదింబర్వతసాగరంబులకవార్యంబై రణక్షోణి
లో | మోదంబిచ్చురథంబునెక్కి యరిగె న్మున్మున్న తిక్రుద్ధుఁ
డై | (౯)

చ॥ అతులయుగాంతకాలచలితాంబుధిరావములొప్పఁ
గేతన। ప్రతతులచేత నెండలునపాస్తములై వడిఁ బాఱ ను
ద్ధత। క్షితిరజమెల్లదిక్కులను జీఁకటిగొంగనుగ్రమ్మించుచుండఁ
ద। త్ప్రతనలుముందునేగు దనుజేంద్రుని వెంబడి నేగెనుగ్ర
తన్॥ (౧౦)

ఉ॥ ఉక్కునవేలుపుందళము నోర్వఁగనేగడు వానిసై
న్యముల్। ద్రొక్కఁగలేచినట్టి క్షితిధూళిదిగంతకరీంద్రదంత
ము। ల్మక్కువనెక్కియందు ధవళద్యుతిఁదాల్చి మదస్రవం
బులౌ। నక్కరికుంభముల్గలసియచ్చట పంకత నందెనయ్యె
డన్॥ (౧౧)

గీ॥ గిరిగుహాల ప్రక్కలించెడుసురవిరోధి। సాంద్రతర
సైన్యపటహానిస్స్వనములకు। జలధులన్నియు నుప్పొంగిక
లఁకఁబాఱె। వేల్పుటేఱది వేగంబ పెంపుఁజెందె॥ (౧౨)

తే,గీ॥ దనుజసేనాసముల్ల సద్ధ్వనులుపర్వ। నంతఁజలి
యించిత్రిదివస్రవంతియపుడు। జలజములతోడఁ బొడవులౌ
నలలచేత। వడిగగీర్వాణగృహములఁ గడుగఁదొడఁగె(౧౩)

క॥ ఆతతఁదారకుముంగల! నాతతమగుచేటుఁదెల్పిన
ట్టదివెతయున్। లోఁతుకడలిముంచెడు ను। త్పాతపరంపరజ
నించెభయదంబగుచున్॥ (౧౪)

తే,గీ॥ దనుజసేనల మాంసంబుఁ దినఁగడంగి। భీకరో
లూకకంకముల్మూఁకగట్టె। యల్లసేనలపై వారి తాతపంబు।
లగు మనింగినిజరియించెనబ్బురముగ॥ (౧౫)

చ॥ పలుమఱు నాతపత్రములు బంగరుటెక్కెములుర్విఁ గూల్చుచు । స్ఖలితధరాపరాగమున సైనికలోచన పంక్తిఁ గప్పుచున్ । గలఁగినఘోటకంబులును గంధగజంబులునుజ్జ్వల ద్రథం । బులుఁగ నరాకయుండఁగను భోరనఁ దెమ్మెరవీచెన య్యెడన్॥ (౧౬)

చ॥ మెదిపినయట్టికాటుకనుమీఱినవన్నియలొప్పుచుండఁ గా । వదనగణంబుచేతబహు వారముగాఁగ విషాగ్నిఁ గ్రక్కుచు । న్నొదలి భయంకరాకృతులఁ బొల్చెడు దీర్ఘభుజంగ మంబులా । యెదుటనుబాటదాఁటిచరి యింపఁదొడంగెనుమా టిమాటికిన్॥ (౧౭)

ఉ॥ ఒంటమిఁబూనియున్న దను జోత్తమునయ్యెడఁ గాంచి వానిపైఁ । గంటునఁబోలెద న్స్మృతిని గ్రక్కునఁ దెల్పఁగఁ బూని తమ్మివా । ల్గంటిమగండుఘోరుఁడయి కాలభుజంగమభీమరూ పమై । వెంటవెలుంగునట్టిపరి వేషముఁదాలిచెనద్దినంబునన్॥

గీ॥ దురమునను గూలు నసురునెత్తురులు బల్మిఁ । గ్రోలఁగా సంచికుతుకంబుఁ గొనెననంగఁ । గమలవనబాంధవునిమ్రోల గుములుగట్టి । నక్కలన్నియు వాపోయెఁ బెక్కుగతుల॥ (౧౯)

చ॥ పవలునుజంచలంబులున పారజవంబులునాచుఁదార క । ల్దివిషదరాతిసైన్యవిత తింబలుమాఱునురాలుచుండఁగా । నవిగని దైత్యుచాపునకు నైనయుపప్లవమిద్దియంచునీ । భువిఁ గలవారలెల్లఁదల పోసిరిడెందములందుసారెకున్॥ (౨౦)

క॥ ఉడుగనితమకాంతులచేఁ । గడలన్నియునాకసముఁ బ్ర

కాశిలమేఘం । బడరనినభంబువలన । న్బిడుగులు వడఁదొడఁ
గెనిసదభీషణభంగిన్॥ (౨౧)

చ ॥ కరమునుదారకాసురుఁడు కంపిలుచుండనభంబుసా
రెకు । న్గురిసెనలాతపుంజములఁ గూరిచి కీకస శోణితంబుల ।
న్సురుసుగ దిఙ్ముఖంబులను ధూమము రేఁగెను రాసభాంగధూ।
సరరుచిఁ గాంచిక్రాలెదురజంబునుదిక్కులుఁదాల్చెనత్తఱిన్॥

గీ ॥ అతులనిర్ఘాతఘోషంబు నద్రిశిఖర । దారణంబం
బరాశాంత పూరకంబుఁ । గర్ణశాతన ముచ్చండ కాల గ
ర్జ । తర్జనంబగు నొక్కనాదంబుపొడమె ॥ (౨౩)

గీ ॥ సాగరములుగలఁగ శైలముల్దూలంగఁ । బెంపు గొ
న్నపుడమి కంపమునను । నతనికరులుమ్రొగ్గె నశ్వము ల్పడి
యెను । భటులు నొకరినొకరు పట్టికొనిరి॥ (౨౪)

క ॥ కుక్కలురవిఁజూచుచుమెడ। లుక్కఱఁబై కెత్తి కర్ణ
యుగళంబెరియం । దక్కక తారకుముంగల । వెక్కసముగన
అచిపిదప వెడలందొడఁగెన్ ॥ (౨౫)

చ ॥ అఱగొఱయింతలేక యపుడంతభయంకరమైఘనం
బుగాఁ । దొఱఁగితనంతఁగాననగు దుశ్శకునావళిమానసంబు
నం । దెఱిఁగియుదుష్టదైవమునకే డ్తఱఁజిక్కినతారకాసురుఁ।
డఱిమిన కిన్కపెల్లునఁ బ్రయాణముమానకపోయె నత్తఱిన్॥

చ ॥ నవముగసంభవించి పరిణామభయంకరమౌ నమం
గళం । బవగతమైనయంత బుధు లందఱుఁ బోవల దంచుఁజె
ప్పినన్ । జెవిఁ జొరనీక తారకుఁడు చెచ్చెరనేగెనసద్గ్రహంబు

చేఁ। దవిలిన వాని కార్యులు హితంబు వచించిన రిత్త యే
యగున్ ॥ (౨౭)

ఉ॥ ఘోరతపీచునట్టి ప్రతికూలసమీరముచేనిరస్తమై। ధారుణిపై వడింబడిన తారకుతళ్కుపసిండిగొడ్గు తా। వార శమిత్తిసల్పునవపారణకేళికి వానికింకరు। లోర్భరనఁ బెట్టినట్టి జగిపుత్తడిగిన్నె యనంగరాజిలెన్ ॥ (౨౮)

చ॥ నిలువఁగఁజాలదీశిరము నిక్కముగానికఁగూలునంచుఁదాఁ। గలయనెఱింగి యప్పుడధికంబగుశోకముచేతఁబోలెనా। బలియునిసత్కిరీటమది పల్కఱురాలెడుముత్తియంబుల। న్స్ఖలితపుబాష్పబిందువుల బాగుగనేడ్చె రయంబుమీఱఁగన్ ॥ (౨౯)

గీ॥ తోడివారలు వైశంబ తోలుచుండ। భావితస్మృతిఁ దెల్పుచుఁజేవమీఱ। నసురుగ్రసియింపఁదలఁచెనోయనఁగవాని। మౌళిగ్రద్దలుపలుమాఱుప్రాలఁదొడఁగె ॥ (౩౦)

శా॥ ఆయింద్రారి సిడంబుమీఁదమృదితంబౌ కాటుకంబోలుచున్। స్ఫాయన్నైజఫణామణిప్రబలశోభాయుక్తమై భీతిసం। ధాయిప్రాగ్ర్యవిషానలంబుమియుఘూత్కారావళుల్ప్రాలఁగా। నాయాత్రన్గననయ్యెనొక్కభుజగంబత్యద్భుతాకారమై ॥ (౩౧)

చ॥ పొరిఁబొరిస్యందనాగ్రమునఁ బొల్చినపావకుఁడాత్మణంబున। న్బరిగిభయంకరాకృతిని బేర్చిమదోద్ధతుఁడైనదానవే। శ్వరుహయకేశ సుశ్రవణచామరముల్త్రాడిదంపుచాప

ము । న్నరములుఁబూణ్ణతూణములుఁ జయ్యనఁగాలిచె నో
డకత్తలకా ॥ (3౨)

గీ ॥ పరఁగఁదనచేటుఁదెల్పునుపప్లవముల । చేతనసురుం
డుపారెనిషిద్ధుఁడయ్యు । మదముకల్మిఁబ్రయాణంబువదలకుం
డు । వేళయందొక్కసురవాణి వినఁగఁబడియె ॥ (33)

ఉ ॥ ఓకఠినాత్మదానవమదోద్ధతఘోరతరాజులందుము ।
క్కాఁకలుదీఱినట్టి బలఘాతుకుఁదొట్టెసుపర్వవీరుల । న్మూఁక
లుగూర్చివెంటఁగొనిముద్దుగమోములసామి వచ్చెబా । హా
కలితోగ్రగర్వముననాతనిమార్కొనఁబోకుమీవిఁకకా॥ (3౪)

ఉ॥ చాయధవున్ననుంగొను నిశాతిమిరంబులు పోలెనింక
దై । తేయులువీరలాపశుపతి ప్రియసూనునెదిర్చియేమియు ।
నేయఁగఁజాల రాజినిదినిక్కము నిక్కముగున్మదాంధనీ । వీ
యెడవానితోడఁగలహించెదవేటికిజ్ఞానహీనతకా ॥ (3౫)

గీ ॥ నింగిఁజుంబించుచున్నట్టిశృంగములను । గడలయం
దెల్లవ్యాపించి కరముమెఱయు । కొంచగుబ్బలి లలిఁవ్రక్కలిం
చినట్టి । మేటితోడనుగలహించెదేటికీవు ॥ (3౬)

సీ ॥ శ్రీకంఠుతోధనుర్వేదంబుఁబఠియించి యుద్ధమందిరు
వదియొక్కమాఱు । ధారుణీశులఁద్రచ్చివారినెత్తురుటేళ్లనాత్రి
యకోపాగ్నినార్చిపుడమిఁ । గలిగిన రాచసింగములకు సంవ
ర్తకారియైతగురేణుకాసుతుండు । నతనితోదురముసేయం
గఁదలంకునీవేరీతినెదిరించిపోరఁగలవు । మదవిమూఢగర్వ మి
డివీడుమాతని । కడఁదిశక్తిబారిఁబడకుమేక । వీరుఁడైనయం
ధకారాతికొమరుని । శరణుఁజొచ్చిబ్రతుకుచిరముగాఁగ॥ ()

క ॥ అనిపాడముగ గనవాణి । ధ్వనిమునుకంపిత సమస్త
విష్టపుఁడయ్యెన్ । దనుజుఁడు గినుకన్వడఁకుచు । ఘనముగ
మినుఁజూచిపలికె గంభీరోక్తిన్ ॥ (౩౮)

గీ ॥ కేరియేమంటిరభ్రసంచారులార । గుహునితో దా
నవుల్పగఁ గొనిరినిక్క। మాతతంబగుమచ్ఛరాఘాతపీడ । మీ
రలిపుడెట్లుమఱచినవారలహహ ॥ (౩౯)

ఉ ॥ అంబరచారులారయనయంబును గార్తికమాసమం
దు ని । క్కంబుగ వెళ్ళఁగొన్న శునకంబులపోలికి రాత్రియంద
ర । ణ్యాంబులభూరిమాయువులయట్టుల షడ్డినజాతమానప ।
త్యంబుబలంబు బాసటననర్థములాడెద రేలయుగ్రతన్॥ (౪౦)

గీ ॥ సాధువయ్యె మీదుసహవాసమునఁదొంగ । వారిసం
గముననుసూరిపోలెఁ । దపసియైనహరుని తనయుండునశియిం
చు । నాదిమిమ్ముఁబిదపనతనిఁగూల్తు ॥ (౪౧)

క ॥ ఈరీతిఁబల్కియసురుఁడ । పారక్రోధమునఁ గత్తిఁబ
ట్టిననమరుల్ । వారకవెఱఁగొనిమోకా । ళ్లారకరాచికొనఁ
బఱచిరోగిదూరముగన్ ॥ (౪౨)

క॥ ముఱియుచుబిట్టుగనవ్వుచు । నొఱనుండినకత్తిదూసి
యుగ్రతనతఁడ । త్తఱినింద్రునికడకరదముఁ । బఱపుము వైళ
మనిసూతుఁబల్కెన్గినుకన్॥ (౪౩)

క॥ మనమునకంటెనువేగము । గనఁబడసూతుండుదోలు
ఘనరథముననా । దనుజుఁడుచనిభీకరమగు। ననిమిషసైన్యాం
బురాశియందంజేరెన్॥ (౪౪)

క॥ ముంగలవేలుపుఁబలగం । బుంగని తారకుఁడుచండ భుజదండములం । బొంగునఁబులకలఁదాల్చెను । సంగరకుతుకంబుమిగులసాంద్రముగాఁగన్॥ (౮౫)

గీ॥ ఇంద్రుసైనికులావార లెల్లఁగదన । కేళిలీలాముదంబునఁగ్రాలికరము । జవముచేమోహరించిరిసంగరేచ్ఛ । గలుగువారువిలంబంబుసలుపరెపుడు॥ (౮౬)

సుగంధి॥ ప్రోలనుండు జంభభిచ్చ మూప్రజంబునంతయు । న్జాలఁగానెదిర్చిదైత్య సైన్యనాథులేపున । న్గ్రాలుబాహులెత్తిహత్తికంటుఁవారికాయెడ । న్బాళితోవచించిరాత్మ నామముల్ప్రయంబునన్॥ (౮౭)

చ॥ ఎదుటమెలంగుచున్నదను జేంద్రుభయంకరసైన్యవారిధి । న్మొదలనెకాంచినిజరచమూనికురుంబములెంతయేనియు । న్బెదరిననీశనందనుని నేత్రమునందపుడొక్కకోణమం । దొడిగెఁదదీయసేన యుఁదదుగ్రభటవ్రజమేమిచెప్పదున్॥

క॥ అరిబలములఁగనివెఱచిన । సురబలముల నంధకారిసూనుఁడుదురము । న్విరచింపనెంచి యమృతముఁ । గురిసెడుచూడ్కులనుజూచె గుఁకతరకరుణన్॥ (౮౯)

గీ॥ త్ర్యక్షనందనుకరుణార్ద్ర వీక్షణమున । నాహవమునకునేల్పులుత్సాహమంది । నేనెపగవారినిర్జింపనేతుననిరి । మేటిబాసట నెవడేపుమీఱకుండు॥ (౯౦)

ఉ॥ ఒండొరుఁతోడఁబోరఁబురుహూతుభటుల్దనుజేంద్రుసైనికు । ల్చండతరా యుధంబులవె సంగొనిమార్కొని రా

హావోద్ధతిఁ । భండనభూమియందుస్తుతి పాఠకులందఱుముం దుఁజేరియు । ద్దండపరాక్రమక్రమకథావిధులన్నియు సన్నుతింపఁగన్॥ (౫౧)

సీ॥ ప్రళయంబుఁగావింపఁగలనికిసే తెంచి వారకతమయున్న మేరమీఱి । కాలునాతిథ్యసత్కారంబుఁగైకొనికడలయుం దెల్లనుగ్రమ్ముకొన్న। చటులసురాసురసైన్యసాగరమునఁ బుట్టియవ్యక్తతఁబొదలునవియు । ధరణీధరోన్నతస్థలభేదనములగు కమలజాండవ్యాపికలకలమ్ము । లెసఁగెసురరాజసేనయు నసురసైన్య । మప్పుడొండొంటిపై భయదాస్త్రశస్త్ర। ములను బఱపుచునెంతేనియలుకఁబూని। సాటిలేనట్టియుద్ధంబు సలుపఁదొడఁగె॥ (౫౨)

గీ॥ రమణఁగాల్వురఁగాల్వురు రథులరథులు । నాశ్వికులనాశ్వికులుమదహస్తిగతుల। హస్తిగతులునుదురము సేయంగనెంచి। మించియొండొరునప్డెదిరించిరరసి॥ (౫౩)

క॥ అన్యోన్యముసురలసురులు। జన్యముఁగావింపఁదఱుమసాగినవేళ । న్మాన్యులగుబట్లువారియ । నన్యాదృశ నామములమునగ్గించిరొగిన్॥ (౫౪)

గీ॥ కదిసిసంగరంబుఁగావించువారల । విక్రమంబుబట్లువినుతిసేయ । నొకనిమేషమూరకుండిసురాసురు । లదివినంగనమహితాత్ములైరి॥ (౫౫)

క॥ ఒండొరుఁదాఁకెడువేళ। న్భండనహర్షమునబలిసివారకభటులక । ల్నిండినతదంగములయం । దుండినకవచములువగిలియూడందొడఁగెన్॥ (౫౬)

క॥ అందడిదంబులఁబగిలిన। బొందిళములనుండి యెగసి పోవుదుదూది। స్పందుగఁజడలున్దెసలును। దందడి నరచేత బోలెధవళములయ్యె॥ (౫౮)

క॥ అత్తఱివారలకత్తులు। నెత్తుటఁజొత్తిల్లిధామనిధివరక రభా। స్వత్తమములగుచుఁగరముఁద। టిత్తులసాదృశ్యమవిగ డించెన్నడిగన॥ (౫౯)

క॥ ఆమెయిఁగినుకనువీర। గ్రామణులేసినశరాళికడుబ్రాడి దంబై। మోములమంటలు గ్రక్కుచుఁ। బాములగమి పోలె మింటఁబర్వెన్దొలుత॥ (౫౯)

క॥ ఉడుగకపోరెడువిలుకాం। డ్రడరుచుబాణములొడళ్ల యందుచ్చికడు। న్వడినెత్తుటఁదడియక యి। ష్వడమినిబ్రచ్చి కొనిదవ్వుపోయెనుసారిదిన॥ (౬౦)

క॥ పంబినవేడుకవారుర। ణంబునవడినేయు మార్గణ ములెల్లనుబూ। ర్వంబుగఁదనువుల నాటిద్వి। పఁబుుఁబడః ద్రోసియవియుఁబడియెన్పిదపన॥ (౬౧)

క॥ అప్పుడుసైనికులేయఁగ। నిప్పులుమియునారసములు నింగిందఱచై। కప్పినవైమానికులొగి। దెప్పరమునఁ దొలఁ గిదవ్వుతెరువేగిరటన॥ (౬౨)

క॥ విలుకాండ్రేసినబాణం। బులతాఁకునఁబగిలినింగి పొ గులునవంగా। బలువుగఁడేగలప్రతిరవ। ములనెపముననఱచెదె సలుబూరటిలంగన॥ (౬౩)

క॥ తెగనిండఁదిగిచివిందుల। మగలేయుశరావళులుసమ

రకుతుకమునం । దగిలినవీరులనెత్తురు । దగఁ గ్రోలం దలఁచెన
నఁగ దవ్వగఁ బఱచెర్ ॥ (౬౪)

గీ॥ ఆసమరవీరులొఱనుండిదూసినట్టి । కత్తులవి వారి చేతు
లఁగ దిసినిండు । ముదమునఁ బోలె దురమందుఁ గొదువ లేని।
కాంతి కైతవమున నవ్వఁ గాఁ దొడంగె ॥ (౬౫)

క॥ నెత్తురు చేతం దడిసిన । కత్తులు తత్ప్రాణులందుఁ గడు నా
డుచుఁ బ్రౌ । ల్లత్తిరజోఘనమైనస। మిత్తునఁ జంచలలశోభ మెప్పు
గఁ దాల్చెర్ ॥ (౬౬)

క॥ మేటిమగలచేతులఁ గల । యీ కెలుసంగ్రామభూమి
నెక్కుడురుచుల । న్నాటికి దిరుగు కృతాంతుని । గాటపు నాలు
కలనంగఁ గ్రాలఁ దొడంగెర్ ॥ (౬౭)

క॥ భూరితరకాంతినొప్పిన । వీరుల చక్రమ్ములపుడు విస్తృత
ముగఁ బం । కేరుహబాంధవబింబ। శ్రీ వెలసిరణాభ్రమునఁ జరిం
పం దొడఁగెర్ ॥ (౬౮)

గీ॥ కొండఅప్పు డెదురుకొన్న వారార్చిన । దండివాహనము
లనుండి పడిరి । యంతలోననితరులందఱుఁ గుమిగూడి । మత్తు
చేత మోహమగ్నులైరి ॥ (౬౯)

క॥ ఇదె కూల్తునంచుఁ దన్నొకఁ । డెదిరింపఁగ నొక్క వీరుఁ
డెలమిం జెందెర్ । మదిఁ గొంకి యతఁడు మఱలిన । నదిగని దుః
ఖంబునొందె నాతండు వెసర్ ॥ (౭౦)

వ॥ అందుఁ గొందఱు రణప్రవీణులు ముక్కాఁకలుదీరిన పె
క్కురతో డందుకంబొనరించి పరిభ్రమించి మున్ను శస్త్రుఁ జా

ట్టుముట్టిన భట్టిదులకట్టెదుటంజేరి వేలువేలఁ బేరుపేరం జీరు-
చుఁగదియువారును మఱికొందఱు యుద్ధమదోద్ధతులై యని
యొనరింపనెంచి తమ్మెదిరించినశూరాగ్రేసరులంగాంచి చండ
భుజదండంబులు రోమాంచకంచుకితంబు లగుచుండ నితాం
తంబగు సంతసంబుఁజెందువారునై యవక్రవిక్రమంబున విహ
రించిరి మఱియును॥

గీ ॥ కదనభూమియందు ఖడ్గభిన్నభటుం । భములనుండి
రాలుమౌక్తికములు। విత్తినట్టికీర్తిబీజమ్ములను బుట్టు । నంకు
రములశోభ నధిగమించె ॥ (౭౧)

క ॥ వీరులు బిట్టొనరించెడు। నారవములఁ బఱచుగజము
లాజినియంత ! ల్వారింపుచున్నస్పృహితతి । నారయ విదళించి
దెసల కరిగెన్భీతిన్ ॥ (౭౨)

క ॥ పైనున్నభటులు తెగినమ । హానాగములాశుగాహ
తాంగములగుచు । న్మానుగఁ బారెడు రుధిరన । దీనివహము
నందు మునిఁగెఁ దిరుగుచునాజిన్ ॥ (73)

క ॥ ఉన్నతము లయ్యునరదము । లన్నెత్తురు టేళ్లము
నిఁగి నప్పుడు రథికుల్ । పన్నిన కినుకను బగతుప । యిన్నెఱ
హుంకృతులతోడ నేసిరిశరముల్ ॥ (౭౪)

క ॥ పెనుగత్తుల చేతఁదల । లునిసిన నిలమీఁదఁ గూలు
తురగములాజి । న్ఘనుము న్నె శాత్రవులచే । వినిహతులౌ సా
దులంభువింబడద్రోసెన్ ॥ (౭౫)

క ॥ వీరులశరముల చేఁదెగి । హ[illegible]వీఁగొఱి

కి కొనుచుశిరంబు । ల్వారని శౌర్యముక్రోధ । మ్మారఁగఁబగ
వారి నెదిరి యప్పుడెపఱచెన్ ॥ (౭౬)

క ॥ అఱనెలసరిములుకులన । త్తఱిఁ దెగిపడు యోధవరు
ల తలలన్నింటి । న్వెఱవక తమపాదంబుల । నిఱికికొనినభోం
గణమునకేగెండేగల్ ॥ (౭౭)

గీ ॥ ఎదిరివచ్చునట్టియిభముల కొమ్ముల । నెక్కి నిక్కి
కాల్వురుక్కుగలుగు । నాశ్వికులుప్రాస హతులచేఁ గరు
లపైఁ । బొలుచువారినేలఁ గలపిరలుక ॥ (౭౮)

క ॥ తమపైఁ గలయోధులుశ । స్త్రములం గూలినఁదమం
త సంగరధాత్రిన్ । భ్రమియించు కరులు సంన । త్తమరు
చ్ఛలితాద్రులనఁగఁగ్రాలెన్బెలుచన్ ॥ (౮౯)

గీ ॥ కంటునఁబెనంగ నిభములొండొంటిమీఁదఁ । దారసి
ల్లిన బల్మిచే వీరులప్పు । డాల మొనరించుచుండి శాతాయుధ
ముల । మించియొండొరులనుగీటడంచిరలుక ॥ (౮౦)

క ॥ మొనయఁగరిదంతములతోఁ । కునఁబుట్టినయట్టిపా
వకుండస్త్రహతి । న్మనుమున్నె నేలఁ గూలిన । ఘను లన్యో
ధాగ్రసరులఁ గాల్చెన్వడిగన్ ॥ (౮౧)

సీ ॥ చండంబులైన వేదండముల్వెన్నంటిగాసిఁబెట్టుచును
న్నఁగాల్వురపుడు । తత్ప్రభువులమ్రోల దారుణతరఖడ్గ ము
ల వానినన్నింటి బిలుకుమాచిర్ । రుగ్ర కరీంద్రంబు లొడిసి
దవ్వోగనేయభటులజీవాత్మలు స్వర్గగతియుఁ । దద్విగ్రహం
బులు ధారుణీగతిఁగాఁచి రెండుచోటులఁజాల నిండియుండ।

౦ధిక తీక్ష్ణమండ లాగ్రధారాహతి। క్షోణితోడ మత్తకుంజర
ముల। భూరితుండములను వారకనతికియు। యోధవరులు
మోద మొందరైరి॥ (౮౨)

క॥ కరివరములు తుండంబులఁ। గరమరుదుగనాక్రమిం
చి కాల్వురదివికి। న్బారి వైవరాగమునసుర। తరుణులువా
రలగ్రహింపఁ దలఁచిరివేగన్॥ (౮౩)

క॥ విలుకాండ్రుగుజ్జములపైఁ। గలవారును గరులమీఁ
దఁగాండాహతిమూ। ర్ఛిలితడవుండియునన్నై। తెలిసినయో
ధాగ్రణులఁ బ్రతీక్షించిరొగిన్॥ (౮౪)

క॥ కినుకం దనుగ్రహియింపఁగ। మొనసినకరిరాజుతుం
డముఁన్ జనుగత్తిన్। దునిమియొక పత్తిదానిన్। గొనకొని
పట్టుకొననెంచి కొమ్ములనెక్కెన్॥ (౮౫)

గీ॥ వీరుఁడొక్కఁడు పరసేనఁ జేరి యందు। భైరవా
కారమగుఖడ్గధారచేత। హస్తిదంతంబులవి మొగలంట నఱికి।
వేగమారంగఁ దనయంత వెడలిపఱచె॥ (౮౬)

క॥ తనుభీకరతుండంబునఁ। జనచివధి పంగఁబూనువేదం
డంబున్। జను వాలుచేతఁ గూలిచి। ఘనుఁడతఁత కాయుఁడై
యొకండు వెలువడెన్॥ (౮౭)

క॥ ఒకపాది కుంతమునఁదా। నొక యాశ్వికు ఱొమ్ముఁ
బొడువనుర్వీఁబడుచువాఁ। డకుటిలమగుతనఱొమ్మునఁ। ది
కమకఁబ్రాసమునఁ బొడువఁ దెలియండయ్యెన్॥ (౮౮)

చ॥ పరువడి శాత్రవుండు తనప్రాణములన్హరియించిమిం

చిన్ । తురగము మీఁదిసాదికడుదుర్దమమూర్తి వెలుంగు
చుండఁ భీ । కరమగు బారుటీటెయను గట్టిగఁ గేలనెతాల్చి య
త్తఱి । న్దిరిగెసజీవుఁడై నకరణీరణధారుణిఁజిత్రమాఁగన్ ॥

సీ ॥ అడ్డంబు లేకున్న నశ్వంబొకండు శస్త్రంబుచేనపగ
తప్రాణుఁడగుచు । ధరణిపైనొరగిన తనసాది నశ్రు వుల్జడి
గొనుచుండఁగ విడువదయ్యె । లాఁతిసాదివిపక్షశాతభల్లంబు
చేదారితాంగుండయ్యుధాత్రిమీఁదఁ । బడుచుమోహంబును బ
డయకకిన్క నహితుఁగూల్పఁగామదినిచ్చగించె । నప్పుడన్యో
న్యకుంతాహతాంగులగుచు । నిద్దఱశ్వంబులను బాసియిలకు
నుఱికి । శక్తికొలఁదిగనందుఁగచాకచియును । బోరిభుజాభు
జిగాఁగను బోరిరలుక ॥ (౯౦)

క ॥ అరదములవారిశరముల । నరదంబుల వారలపగ
తాసువులయ్యు । న్బరిగళితచాపులై సు । స్థిరముగఁగూర్చుం
డిబ్రతుకు చెల్వఁగొనిరొగిన్ ॥ (౯౧)

గీ ॥ ఒక్కరథిశస్త్రహతి మూర్ఛ నొందియున్న । యొ
క్కరథికునిఁగొట్టంగనొగ్గఁడయ్యె । మగుడఁదెలివొంది యా
తండుజగడమునకు । రామదినిగోరినిలిచెసంగ్రామభూమి ॥

గీ ॥ రథికవరులిద్దఱప్డుపరస్పరాశు । గాళిహతులనుప్రా
ణముల్గోలుపోయి । సురనగరికేగి యొక్కయచ్చరనుబొంది ।
ఘోరవైఖరి మగుడంగఁ బోరిరందు ॥ (౯౩)

క ॥ అరిదిమిథశ్శస్త్రములన్ । శిరములు దెగరథికులొ
ప్పు సిరినిద్దఱుఖే । చరులైధరమీఁదంబడి । పొరినాడెడుతత్క
బంధములఁజూచిరొగిన్ ॥ (౯౪)

చ ॥ నవముగరక్తపంకమ స్సృణంబగు సంగరరంగమం దుఁదూ । ర్యవరము లెల్లమాటికి మహాద్భుతభంగిధ్వనింపు చుండఁ బ్రే । తవనితలందఱు న్ప్రకటితంబుగ గానము సేయు చుండఁగాఁ । బ్రవిమలశస్త్రపాణులు కబంధము లాడఁ దొ డంగె నొక్కటన్ ॥ (౯౫)

వ ॥ ఈలీలనవ్వేలుపు దళంబును దాలివేలుపుబలగంబు నుఘోరంబుగఁ బోరు నెడ నస్సృక్తటినీ తటంబులు నిమజ్జద్ధ్వజినీగజరాజంబులై విరాజిల్లుచుండ స్వర్లక్ష్మీచికుర విదార కుండైన తారకుండు కినుకం గనుంగవయనంతశోణప్రభాభా సురంబై చెలంగ సంభ్రమభ్రమద్భ్రుకుటీఘటనావికట నిట ల తటుండై సంగ్రామకామంబున వజ్రభృత్ప్రభృతికకుప్పతు ల నెదుర్కొని కవిసిన ॥

చ ॥ పిదపసమస్తదిక్పతులు భీషణవైఖరితోడముంగలం। గదనముసేయనెంచి కుతుకంబును సమ్మదముప్పతిల్లఁగాఁ ।బ్ర దరములం దిశావళినభంబునఁ జీఁకటి గొల్పుచల్కతో । నె దురుగవచ్చుదైత్యుఁగని యేపునఁబోరఁదొడంగిరయ్యెడన్ ॥

శా ॥ గ్రావేంద్రంబులమీఁదఁగిన్కగొనువర్షాకాల మే ఘుండుబ। ల్చేవన్ సంతతవారిధారలనుబోలెన్ శాత్రవాళిఁ బు ట్టా । దేవద్వేషణ చక్రవర్తి యప్పుడెంతే నవ్వి ఘోరంబు గాఁ । దావర్షించెనుబాణముల్త్రిదశసంతానంబుపై వ్రేల్మి డిన్ ॥ (౯౭)

గీ । కలనఁదార్క్ష్య సంఘములుకాద్రవేయాళి । కరణి

నింద్రముఖ్య హరిదధీశు । లేయుశరముల సురనాయక శరకో
టి । గ్రుచ్చిపలుకువాఱవచ్చెనపుడె ॥ (౯౯)

చ ॥ అలయక తారకుండు చటులాగ్ని తృణంబులఁబోలెను
జ్వల । త్ఫలములుభీకరంబులును దానవనాయకనామవర్ణ ।
సం । కలితములైన భూరివిశిఖమ్ముల చేతను దిజ్ఞభస్థసెల
మ్ములనొగిఁగ ప్పినిజకారవిముక్తశరంబులఁజించెనొక్కటన్ ॥

చ ॥ కొలఁది యిడంగరాని పెనుకోపమునంగడు భీషణా
త్ముఁడై । నలదనుజేంద్రుఁడేయు నిశితాశుగ పంక్తులు శీఘ్ర
మారఁగుం । డలివరరౌద్రభావము ఘనమ్ముగఁ దాల్చి రణం
బునందు న । బ్బలరిపుఁడాదిగాఁ గల సుపర్వుల బద్ధులఁజేసె
నందఱన్ ॥ (౧౦౦)

ఉ ॥ క్రాలుభుజంగపాశవిశిఖంబులచేతను బద్ధులైన ది ।
క్పాలురు వాసవాదులగు వారలు నూరుపుగాలిమోముల ।
న్గాళిమపర్వఁబర్విడిరణంబునకు న్వెనుదీసియాపద । ల్గోలెడు
దంటయౌ నళికలోచన నందను డాసిరందఱున్ ॥ (౧౦౧)

చ ॥ వినుసిగవేల్పునందనుని వీక్షణపాతముతోనె వా
రికా । యనుపమ నాగపాశ రచితాఖిల బంధ సముజ్జ్వల
ద్వప । జ్జనితమహోగ్రదుఃఖమదిసర్వమువీడినఁదద్దడాసియా ।
యనిమిషులెల్ల నక్కొమరు నద్భుతభంగినుతించిరొక్కటన్ ॥

సీ ॥ మండెడుకోపాగ్ని మెండుగాఁగనుపట్టఁ జండదోర్వి
క్రమోద్దండుఁడైన । సురరాడ్విరోధి చెచ్చెర నాత్మ సూతుని
తోనిట్లువలుకంగఁ దొడఁగె నిపుడు । ఫణిపాశముల నేనుబం
ధించినగిరిభిత్ప్రభృతులైనట్టిదిక్పాలకులను । శూలికుమారుఁ

డీ బాలుఁడక్కటికంపు కడకంటి చూపున విడిచి పుచ్చెఁ। గానవీరల విడనాడి క్రౌర్యమెసఁగ। వాని నవనికిబలిపెట్టి। వాఁడ నేను। మనరథమువానిపజ్జకేపుననుదోలు। మమ్మహాబలుతోడఁ బోరాడవలయు॥ (౧౦౩)

వ॥ అనవుడు।

ఉ॥ సారథితారకాసురుని స్యందనమప్పుడు దోలె క్ష్మో భవ। ద్వారిధిధీరఘర్ఘర రవంబుల ఁబోలిన్వనుల్సెలంగఁగా। ఘోరరణాంగణంబునను గూలినమాతుఁగ రమాంసకీకస। స్ఫారితరక్తపంకమునఁ జక్రములెంతయుఁ గ్రుంగుచుండఁగన్॥

చ॥ ప్రళయమరుచ్చలత్పృథుల పర్వతతుల్యమునేమిపీధికా। దళదళలామరాతిఁ రచితధ్వనికా భ్రముదైత్యనాథుని। స్తులరథరాజమయ్యెడ నెదుర్కొని రాఁగనిదేవ సైన్యము। ల్వడఁకుచు నాత్మధైర్యమునుబాసి చలించి తొలంగె గ్రక్కునన్। (౧౦౪)

ఉ॥ బాములఁజెందికుందెదు సుపర్వబలంబుల వానిచెంతసం।గ్రామకుతూహలంబుననుగానఁగవచ్చెదుశంభుసూనుఁ జే। రామునఁగాంచిభీకరశరాసముకేలను గ్రాలుచుండను। ద్దాముఁడుతారకుండు గుహుందాపునఁజేరివచించెనీగతిన్।

ఉ॥ ఏలరయోరిశంకరమునీంద్ర శిశూభుజదర్పమంతయు। నీ్వదుముపీదుమాయమరనేతకుబాసటయాట మానుమీ। బాలుఁడవాటమెత్తనగుబాహువులంచతిఘోరభూతశ। స్త్రాళిధరించె దేమిటికినహామఁజాలనిరర్థకంబగున్।

శా॥ నీవాకట్టండవె పార్వతీహరులకు న్నెయ్యంపుఁబు
త్రుండవై। నావజ్రాభశరాళిఁ జిక్కి జమునిం టన్జేరఁగానెంచె
దా। హావేగంబనికిందొలంగిచని పిత్రంకంబునదిష్టుప్రే। మా
విభూతివసించిదానికతిర మ్యత్వంబుసంధింపుమీ॥ (౧౦౮)

గీ॥ వజ్రధరవైరినగునన్ను స్వాంతమందుఁ। దెలిసితొలఁ
గుముసక్కందయీబలవిరోధి। లోఁతునీటనుశీఘ్రంబరాతియో
డ।పోలెమునుఁగును మునుమున్నెముంచునిన్ను॥ (౧౦౯)

వ॥ అనిపల్కిన॥

ఉ॥ ఈకరణిన్వచించుదను జేశ్వరువాక్యములాలకించిస।
త్తోక్కనదారుణాక్షుఁడయిగొబ్బుననోష్ఠము కంపమందఁగా।
నాకొమరుండుకొంకకశరాసనముంబలుమాఱుఁజూచుచు।న్వీఁ
కనుశక్తిఁదాఁకుచునువేడుకతోవచియించెనీగతిన్॥(౧౧౦)

గీ॥ అసురనాయక నీవుపేరాముచేత। నాడినదియెల్ల నీక
ర్మమగునునిజము। సారిదినీదోర్బలంబునేఁ జూచువాఁడ।
విల్లుమోపెట్టిశస్త్రంబువేగఁగొనుము॥ (౧౧౧)

మ॥ అనియీచందమునన్వచించుతఱిలోనయ్యంబికానం
దను। న్గనిదైత్యేంద్రుఁడుపెద్దకోపమునసందష్టోష్ఠుఁడై చేరినేఁ।
డనికై చండభుజాబలంబునమహా హంకారమున్గొంటివీ। వెన
ర్యాశాత్రవపృష్ఠభేదనములా నీకోలలనై వుమీ॥ (౧౧౨)

వ॥ అనిపలికి॥

ఉ॥ శత్రుదురీక్షణీయమగు చాపముసజ్యముఁజేసియప్పు
డే। చిత్రముగాఁగఘోరములజిహ్మగముల్వడినేసెఁగ్రోధదు।

గాఁ ద్రమహాభుజంగమములై వడిభీషణమైనవింటఁద । జ్జైత్ర
మహాశుగంబులవెసన్నటియించునుమాకుమారుపై॥ (౧౧౩)

గీ॥ తారకుఁడుకర్ణమూలంబుఁదాఁకఁదిగుచు । ధనువ
పుడు తేజములమింట ననుపమాన । లసితచిత్రంబులనుఁగూర్చి
దెసలకెల్లఁ।బలితమురచించుబాణౌఘములనుగురిసె ॥(౧౧౪)

చ॥ కడువడిదానవాధిపతి కార్ముకముక్తమహాశరంబుల।
న్నొడమినఘోరనాదమునఁ బోరభటుల్భయమందుచుండన ।
య్యెడసురసైనికాక్షులకునెంతయుఁగ్రుడ్డితనంబుమీఱనా । మృ
డునికుమారుఁడెందయిన దృష్టికగోచరుఁడయ్యెఁజయ్యనన్ ॥

ఉ॥ వీఁకపడానసుండు తనవిల్లపుడెక్కిడి కర్ణమూల
ము । న్దాఁకఁగఁదీసివైచునిశితప్రదరంబులవెల్లనమ్మహా।నీకము
నందునద్దనుజనేతధనుః ప్రహితంబులైనయ । స్తోకనిశాతబా
ణములఁద్రుంచె సురల్నుతియింపుచుండఁగన్ ॥ (౧౧౬)

గీ॥ ఆతతామరబలదుఃఖహేతువైన । యసురవరశరదు
ర్దినంబడఁగినంత । స్కందుఁడుద్దండతేజః ప్రచండుఁడైన।
చండకరుభంగివెలిఁగెనాభండనమున ॥ (౧౧౭)

క॥ ఈకరణిఁగలనగుహుఁడతి ।భీకరతేజంబుఁదాల్చి వె
లిఁగెడుతఱిమా । యాకరుఁడుతారకుఁడుకడు । వీఁకన్మాయ
పుదురంబువేగమొనర్చెన్॥ (౧౧౮)

చ॥ కరమనినీతుఁడై యలుకఁగల్మషుఁడై జయకాంతుఁ
డారసుం । డరయఁగశస్త్రయుద్ధము భవాత్మజుతోనొనరింప
రిత్తయై । పరఁగునటంచునెంచికడుఁబ్రౌఢిమబిట్టుగనవ్విచాప

మం । దరిదిసమీరణాస్త్రము రయంబునఁగూర్చె భయంకరం
బుగన్ ॥ (౧౧౯)

ఉ ॥ వింతగదానిఁగూర్చినవేళముల్లోక భయంకరంబు
న । త్యంతగభీరమానినద మారఁగ ధూళినిఛాదితాంబరా ।
శాంతరమై నితాంతముగ నర్కునిఁగప్పి యుగాంతసంభవ ।
భ్రాంతిజనించునట్లొక ప్రభంజన మప్పుడువీచెనుక్కునన్ ॥

ఉ॥ చాలఁగఁదత్సమీరమునఁజయ్యనఁగంపముఁజెందిమొ।
ల్లల । నొబ్బలిదిగీశసేనలకుఁబొల్పునొసంగుచున్న ఛత్రము ।
ల్రాల్చుచుపైకినేగెడుమరాళములన్బరుడించిమించిమే ।ఘాళి
సమానధూళిమలినాభ్రమునన్బలుతున్కలై చనెన్॥ (౧౨౧)

సీ ॥ చెలఁగుమల్లెలఁబోలు జేజేల పడగలా తెమ్మెరచేఁజీలి
దివికినేగి । నెఱితెల్లవలువల నెపమునస్వర్ధునీ స్రోతస్సహ
స్రవిభ్రాంతిఁగూర్చె । నాగాలిచేఁదూలియమరగజంబుల పైను
న్నకుథములుపగిలివేగ । బలభేదికినుకతెక్కలుద్రక్కలించిన
పర్వతంబులభంగిఁ బడియెఁబుడమిఁ । బగ్గములువీడిగుఱ్ఱము
ల్భ్రాగ్గతిలఁగ । సారథిశ్రేష్ఠులెంతయు జాఱిపడఁగ ।సురలర
థరాజిగాలిచేఁదిరుగుడువడి । ధ్వస్తమైధాత్రిఁబడె విపర్యస్త
మగుచు ॥ (౧౨౨)

ఉ ॥ ఆలమునన్దిగీశబలమందలి యాశ్వికులబ్రమారనా ।
గాలిని దూలిహస్తములఁగల్గినకత్తులవీడనాడికా। లాడకయా
త్మఘోటకములన్నియు మున్నగనేలఁద్రెళ్లఁడా। కాల్బలికశ
స్త్రఘాతములఁ గానకయేపడిరందఱుర్వరన్ ॥ (౧౨౩)

గీ ॥ దానిచేఁదూలివేల్పుకాల్బలములెల్ల । నాయుధంబుల

విడిచి బిట్టఱచి పెద్ద । గాలిఁదూలిన కారాకు గతిభ్రమించి ।
సురసరణి నేగిదవ్వగధరణిఁబడియె॥ (౧౨౪)

క ॥ సురపతిసిరికిని క్షేమం । కరుఁడైన గుహుండు తార
కప్రహితాస్త్రి । త్వరఁజెడినవేల్పుదళము । న్బరికింపుచుది
వ్యమగుప్రభావమొనర్చెఁ॥ (౧౨౫)

గీ ॥ ఆప్రభావంబుచే సురలార్తిఁవిడిచి । కరము కట్టుప
కాసులై కవియుటను । గాంచి కోపాగ్ని మదిఁ బ్రజ్జ్వలించు
చుండఁ । దారకుఁడు వెండిపావకాస్త్రింబుఁ బఱపె॥ (౧౨౬)

వ ॥ అప్పుడయ్యస్త్రప్రయోగమాత్రంబునఁ బ్రావృట్కా
లాతికాలవలాహక ద్యుతులును నిబిడసమాచ్ఛాదిత హరిత్త
తులు నీలోత్పల మాలికాజాల శోభా విభాసురాకృతులున
గోచరీకృత జగద్వితతులునగు ధూమంబులుద్దామంబులై చె
లంగె నట్లుగిలితాఖిల దిఙ్మండలంబులై ఘనంబులగు ఘనం
బుల చెలువున నిరంతరంబు లగు తిమిరంబుల కరణి నెగడిన
యాపొగలచే స్థగితంబగు గగనంబుంగాంచి రాయంచలుదం
చితప్రమదసమంచితంబులై మానససరోవరంబున కరుగ న్న
మక్టైనంతఁ బ్రళయవేళా ప్రజ్వలజ్జ్వల నతులితుండై హు
తభుజుండు విపులతాసదనంబులగు దిశావదనంబులనునిర్మ
లంబగు గగనస్థలంబు నాభీలజ్వాలామాలికలచేతం బంజరం
బులఁగావింపుచుఁ గ్రతుభుక్కదంబకంబుల నెక్కడంజూచినన
ఖండంబుగ మండందొడంగిన ।

ఉ ॥ చండతరస్ఫుర జ్జలదసంహతిఁబోలెను ధూమపంక్తి
చే । నిండినయానభస్థలి వినిద్రనిరర్గళవహ్నిసంభవో । ద్దం
డ మహాద్భుతానవరతప్రకటాతుల హేతిసంతతి । న్గండిత

టిద్గణంబులను దార్కొనినట్టులఁ జూడఁగాఁబడెన్ ॥(౧౨౭)

గీ ॥ అళుకు రెట్టింప ఖేచరుల్తూలఁగి పఱవ । వికటముగ మండు నయ్యగ్గిసకలదేవ । సైనికులఁగాల్పఁజొచ్చిన జంకివా రలాగుహుని చెంతకరుదెంచిడాఁగిరపుడు ॥ (౧౨౮)

ఉ ॥ పోలఁగఁ దారకాస్త్రమునఁ బుట్టిన సాంద్రతరాగ్ని ఘోరమై । కాలుచుచుండఁదద్భయ కంపితమైతనచెంతఁ జేరునా । వేలుపుసేనఁ గన్గొనుచు వేచిఱునవ్వు చెలంగుచుండ నా । శూలిసుతుండుచాపమునఁ జొప్పడఁగూర్చెను వారుణాస్త్రముల్ ॥ (౧౨౯)

చ ॥ నిబిడతమోవ్రజంబు కరణిన్భయదంబయి కల్పకాలమం । దుబ్బడిదమైనపావకునిధూమముఁబోలినభోంగణంబున । గ్రమ్మబలెడు గర్జితంబుల ధరాధరకూటములూడ్చుచున్నసం । తబలిసిమేఘరాజివితతంబుగనెల్లెడఁబర్వెనత్తఱిన్ ॥

గీ ॥ ధీరరవమున ఘోరమై దెసలనెల్లఁ । గవిశములఁజేయు నమ్మేఘచపలయపుడు । ప్రళయమున లోకములఁగ్రమింగఁ గడఁగుజమునిశ్చట్టిదపునాల్కగతివింత వెలయఁజేసె ॥(౧౩౧)

వ ॥ వెండియు నకాండంబిని సలిలగళంబులును మహోన్నతంబులునగు సంవర్తశర్వరీదుర్వార వార్వాహంబులచే వీక్షకాక్షిప్రావరణంబుఁ గావింపుచు సముంచితచంచలలచే దెసలకెల్లనసమంబగుపసఁగూర్చుచువిస్ఫూర్జితగర్జితంబులనతిరౌద్రంబై యుప్పరంబంతయుఁగప్పియొప్పెనిప్పగిది నుప్పరంబుఁగ కుప్పంక్తులుంగప్పి భైరవారావంబులచే హృదయంబుల నదల్చు నవ్వారివాహ వారంబు లపారధారల నిరతంబుగఁ గురియందొడఁగిన॥

ఉ ॥ భైరవమైన చీఁకటి నభస్థలమంతయుఁ గప్పి ఘోర
గం । భీరతరధ్వనిన్దనుజవీరుల గుండెలు వ్రక్కలించు నా వ్వా
రుణ బాణసంజనిత వారిదముల్వెనువెంట నేమహా । కారము
తోడ లోకములఁ గ్రమ్మినవహ్ని శమింపఁజేసినన్ ॥ (౧౩౨)

మ ॥ దనుజాధీశుఁడు కోపమారఁగను గోదండంబుఁగల్గా
తమం। దెనయందీసిభయంకరాకృతుల చేనేపాటురల్రాల్చి వా
యనిమేషధ్వజినీవ్రజంబులుభయోపాత్తంబులై పాఱను। మ్మో
నవాల్దాల్పుకుమారునుక్కసెడఁగా మోదెన్నమఃగ్రోద్ధతిన్ ॥

చ ॥ సమరకళావిశారదుఁడు శంభుకుమారుఁడు యోగి
తెంపునై । యమనియమాదియోగముల నద్భుతసంసరణప్ర
భూతమై । యమరు నిరంతరోగ్ర విషయ వ్రజముం బలెము
ల్కు లన్నియ । క్రమముగు వింటితో నతనికాండముల్దునుమా
డెనుద్ధతిన్ ॥ (౧౩౪)

గీ ॥ భ్రుకుటిభయదాస్యుఁడుద్దీప్తరోషదహనుఁ। డగుచుఁదా
రకుఁడరదంబు డిగియుఖేల । దుగ్రచటులాసి ధారణోదగ్రగ
తిని । బురవిరోధి కుమారుపై కరిగెవేగ ॥ (౧౩౫)

ఉ ॥ అచ్చెరువారఁగా సురల కాపఁగరాని భుజాబలంబు
చే । నచ్చటఁదారసిల్లియెదురై చనుదెంచుచు నున్న తారకు ।
న్గ్రిచ్చనఁజూచి స్కందుఁడు వికాసము మోమున లంకరింపఁ
గా । నొచ్చెములేని కల్ప దహనోజ్జ్వల శక్తినివైచె వా
నిపై ॥ (౧౩౬)

సీ ॥ బలవైరిముఖ్యదిక్పాలురకెల్లను సమ్మదాశ్రుజలంబుగ్ర
మ్మువేర । దానవాధీశ్వర సైనికులకు శోకసంతప్తబాష్పము
ల్పందడింప । నురుతరప్రభలచే నుద్ద్యోతి తాకాశ హరిదంత

రాళమైయురుగు దెంచి । యాశక్తియల తారకాసురనాయకు
వేఁడదఱొమ్మునఁబడఁబుడమిఁగూలు । నతనిశక్తిహృతప్రాణున
నుపమాన । కల్పవాతాహతాద్రి శృంగంబుఁ బోలెఁ । గాంచి
రోమాంచ పరిలసద్గాత్రులగుచు । నింద్రముఖనిజరులువే
డ్కఁజెందిరిపుడు ॥ (౧౩౭)

చ ॥ ప్రళయమునందుఁగూలుగిరి రాజముభంగినిగయ్య
మందునా । బలియుఁడు తారకుండెచటఁ బ్రాణములన్విడనా
డికూలెనా । యిలలలిఁగ్రుంగుచుండఁ గనహీశుఁడు తద్భరకా
తరంబులై । పడగల నేయిటన్నిలుగు పైకొనఁ దాల్చె మహో
ద్భుతంబుగన్ ॥ (౧౩౮)

గీ ॥ తారకునిఁగూల్చి నట్టికుమారుమీఁద । సురనదీవీచిశీ
శిరశీకరయుతంబుఁ । బరిమళాసక్తరోలంబ భరితమైన । క
ల్పసుమవృష్టి దివినుండికరముఁగురిసె ॥ (౧౩౯)

చ ॥ పులకభరంబునన్గవచపూగములెల్లనుపీడుచుండఁగా ।
నెలమిని మోముదమ్ములు సమిద్ధశుభద్యుతిఁ దాల్చుచుండఁ
గా । బలరిపుఁడాదిగాఁగలసుపర్వులఖర్వబలప్రశస్తమై । వెలిఁ
గెడుతారకారిభుజవిక్రమమున్వినుతించిరొక్కటన్ ॥ (౧౪౦)

ఉ ॥ శ్రీకరుఁడున్విరోధిజయశీలుఁడుశంభుతనూజుఁ డాజి
లో । లోకహృదంతశల్యమతి లోకబలుండును నైనతారకు ।
న్వేఁకనుగూల్చినంత బలభేదినుపర్వ కిరీటరత్న శో । భాకలి
తాంఘ్రిమైత్రిదివపట్టణమేలెసుఖంబుమీఱఁగన్ ॥ (౧౪౧)

క ॥ హర్యక్షరాజశౌర్యా । వీర్యవశీకృతసమస్తవిద్విడ్వ
ర్యా । యర్యమతేజసమగ్రా । దార్యాధరితాంగరాజదర్పి
తచర్యా ॥ (౧౪౨)

(తోటకము) గిరిరాట్కరిరాట్సమకీర్తిధనా । పురజి
న్మురజిన్నతిపుణ్యనిధీ । యురగీవరగీతగుణోత్కరధీ । శరధీక
రదీకృతశత్రునృపా ॥

గద్యము॥ ఇది శ్రీముకుంద చరణారవింద వందనానందమ
రందతుందిల మానసేందిందిరుండును శ్రీమన్ముద్దుకృష్ణధ
రాపురందర నిరంతర విశ్రాణిత వివిధమణి కనకభూ
షణ సదంబరాలంకార మహాగ్రహారాది సముపభో
గసంజాతప్రమోదసుందరుండునశేష భాషా శేష
సారస్వత శేష శాస్త్రి ప్రియచ్ఛాత్రుండును
బిరుదరాజకులకలశాంభోధి రాకాశశాంక
వేంకటాద్రిరాజపౌత్రుండును జెంగల్వరా
జకవిరాజసుపుత్రుండు నుభయభాషా
భూషణుండును రసికతోషణుండును
సుకవివిధేయుండునగు శేషాద్రినా
మధేయుండు విరచించిన కు
మారసంభవ కావ్యంబున
సర్వంబును
షష్ఠాశ్వాసము.

శ్రీమదాంధ్ర కుమారసంభవకావ్యము.

సంపూర్ణము.

| పుట సంఖ్య. | పఙ్క్తి. | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| ౨ | ౨౧ | శిశామణి | శిఖామణి |
| ౧౧ | ౭ | శ । వ౯ద | శ । ర్మద |
| ౧౪ | ౬ | పుక్కిటఁ | పొక్కిటఁ |
| ౧౬ | ౧౪ | తొజాంటితి | తొంటిజాతి |
| ౧౯ | ౧౯ | నూనాథ౯ంలున | నూనార్థంబులున |
| ౨౧ | ౪ | లనయమై | లనయనమై |
| ౨౨ | ౩ | నందఁను | నందఁడు |
| ౨౨ | ౧౧ | ఎల్లడ | ఎల్లెడ |
| ౨౪ | ౧ | కవ్వలిజది | కవ్వలిజడి |
| ,, | ౧౬ | నిట్టిటు | నిట్టటు |
| ౩౬ | ౨౦ | చంచంల | చంచల |
| ౪౬ | ౪ | పాలుపెట్టుక | పాలుపెట్టక |
| ౫౮ | ౧౨ | జనింప | జనింప |
| ౭౬ | ౨ | గావరము | గారవము |
| ౭౮ | ౮ | కంలతు | కంతుల |
| ౮౨ | ౬ | వీణాక్షు | వీక్షణ |
| ౮౪ | ౧౭ | దలంచె | దలంచెద |
| ౯౦ | ౭ | వచింపఁగ | వచియింప |
| ౯౪ | ౫ | తడసిన | తడిసిన |

| పుటసంఖ్య. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ,, | ౮ | మయ్యేను | మయ్యును |
| ,, | ౨౨ | సంకొచంబు | సంకోచంబు |
| ౧౦౦ | ౧౯ | శాయువు | వాయువు |
| ౧౦౧ | ౨౧ | పమోద | ప్రమోద |
| ౧౦౩ | ౧౭ | నాకృతిగా | నాకృతిగాం |
| ౧౦౫ | ౧ | మానాడ్కి | మాడ్కినా |
| ,, | ,, | ర్వీయము | వీర్యము |
| ౧౦౭ | ౨ | సిరిగతి | సిరినది |
| ,, | ,, | వుఁన్ను | వుఁ। జన్ను |
| ౧౦౮ | ౯ | వేఁడెదరటంచు | వేఁడెడినటంచు |
| ,, | ౧౧ | తురషా | తుషార |
| ౧౧౦ | ౧౧ | తుంగుండు | తుంఘుండు |
| ౧౧౧ | ౧౪ | విస్మతాస్యు | విస్మితాస్యు |
| ౧౧౪ | ౨౦ | ్వనడిగ౯ | న్వడిగ౯ |
| ౧౧౫ | ౨౦ | చేరివా | చేరినవా |
| ౧౧౬ | ౨ | కుసమ | కుసుమ |
| ౧౧౯ | ౧౪ | యొఢొంరుల | యొండొరుల |
| ౧౨౨ | ౩ | చేరఁదీసి | చేరఁదీసి |
| ౧౩౦ | ౨౨ | తరుణా | తనరుణా |

| పుటసంఖ్య. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౩౨ | ౧౧ | వైరూప్యమ | వికృతమున |
| ౧౩౪ | ౭ | మీద్దైర్య | మీధ్దైర్య |
| ౧౪౪ | ౨౨ | దీవనలు | దీవనల |
| ౧౪౬ | ౪ | పెల్లున్గ | పెల్లునన్గ |
| ౧౫౦ | ౧౫ | ల్తృతత | ల్తృత |
| ౧౫౭ | ౧౭ | ట్టది | ట్టిది |
| ౧౭౫ | ౨౦ | కరమనినీ | కరమవినీ |
| ౧౭౯ | ౨౨ | సమ్మదాశ్ర | సమ్మదాశ్రు |



## శ్రీమదాంధ్ర కుమారసంభవ కృతి ప్రశంస.

మహారాజశ్రీ, బిరుదరాజ శేషాద్రిరాజుగారిచేఁ దెనిగింపఁబడిన, శ్రీమదాంధ్ర కుమార సంభవమును సాంతముగఁ జదివినారము. కవిత్వము పెటుకుగాక మార్దవమును వహించియున్నది. ఈకవి యింతకుమున్ను "౧- చంపు విరాటపర్వము. ౨- పుష్పబాణ విలాసము" లోనగు గ్రంథములను వ్రాసియున్నాఁడు. వానిని విమర్శించియున్నారము. కవనము రానురాను జాను మీఱుచున్నయది. "కుమారసంభవము విజ్ఞులు మేలుభళీయనంగఁదె! గ్రింపుము, గోస్తనీరసముఁగేరు మృదూక్తిమదంకితంబుగన్" అనికృతిపతి గోరినట్లేయీ గ్రంథమంతయు ద్రాక్షాపాకమున వ్రాయఁబడినదనుటకు సంశయములేదు. ఇప్పటి కవులలోఁ గొందఱు పెడకట్టెలవలెఁ "దనదికొంత తాళ్ళపాకవారిపైత్యముకొంత" యను నటుల నీరసమైన నూతన పద్యములను; అప్రశస్తమైన రల- డడ వబ- గఘ- బభలప్రాసములం గలిపి వ్రాయక ప్రాచీనాచారము నవలంబించి వ్రాసినందున నీగ్రంథమునకు విశేషఖ్యాతి వచ్చుననుటకు సందియము లేదు. ఈగ్రంథమున నించుమించుగఁ దొమ్మిదివందల పద్యములున్నవి. ఈగ్రంథకర్త, మహారాజరాజశ్రీ శ్రీ వెలుగోటి ముద్దుకృష్ణ యాచభూమీంద్రులవారి యాస్థాన కవిశిఖామణియై ఖ్యాతిని వహించి యున్నాఁ

డు. ఆంధ్ర భాషాభివృద్ధికై యీప్రభురత్నము మిగులఁ బ్రయాసముం గైకొని, పండితసింహులం జేర్చుకొనుచు, గ్రంథముల స్వకీయ ముద్రాక్షర శాలయందుఁ బ్రకటించుచుండుట లోకవిదితమైన యంశము. ఇఁకఁ గృతికర్తంగూర్చి యించుక ప్రశంసింతుము.

క॥ ద్రాక్షాపాకమునందగు ।
వీక్షింప భవత్ప్రబంధ విధమసదృశమా ।
లక్షణవిచక్షణాగ్రణి ।
యాక్షితినిది వెలయుఁగాత, యినతారకమై ॥

క॥ కుటిలకటూక్తుల చేనల ।
మటపెట్టక భారతిఁ గ్రమంబుగ మృదువా ।
నటు చేసుకొంటిమేల్ నీ ।
పటుపద్యసముచ్చయంబు బాగై తనరున్ ॥

కృతిపతింగుఱించి.

క॥ జిష్ణుండై, శ్రీముద్దుల ।
కృష్ణమహీపాలవిభుఁడుకీర్తిఁగనుత, వ ।
ర్ధిష్ణుప్రతిభఁ గెనుంగున్ ।
గృష్ణవిభానికరణిఁబ్రోచిగేయస్ఫూర్తిన్ ॥

అముద్రితగ్రంథచింతామణిపత్రికాధిపతి.

## కాళిదాసకృత కుమారసంభవముయొక్క ఆంధ్రీకరణము యొక్కవిమర్శనము.

ఈగ్రంథము శ్రీవెంకటగిరిరాజాగారిసోదరులగు శ్రీముద్దుకృష్ణయాచేంద్రబహాదర్ గారి ప్రేరణచేఁదదాస్థానకవీంద్రుఁడునుభయభాషాభూషణుండునగు బిరుదరాజ శేషాద్రిరాజకవివరుచేవిరచింపఁబడె. ఇయ్యదిసంస్కృతమాతృకకనుసరియైభేదమనునది యించుకయైనను కలుగక మిక్కిలి గమనికతో నాంధ్రీకరింపఁబడినది, ఈయాంధ్రీకరణంబున యీకవివరునకుంగల భాషాచమత్కృతియెంతయు తేటపడుచున్నది. కడవఱకుమిగుల సులభమైనశైలియందు మృదువగుటహృద్యమగు ద్రాక్షాపాకముననే రచింపఁబడెను.

కాళిదాసమహాకవివరుచమత్కృతి నెఱుగఁగోరువారెల్లరునీగ్రంథమును జదువుటయావశ్యకమని మాయభిప్రాయము. మఱియును వీరింతకు పూర్వము రచించిన చంపూవిరాటపర్వముకన్నను మిక్కిలి శ్లాఘనీయముగనున్నది, ఒకగ్రంథముయొక్క ఆంధ్రీకరణముననింతటి సులభశైలిని వ్రాయుట మిక్కిలి కష్టతరముకావున నికవిగారెంతయుకొనియాడఁదగియున్నారు. ఈకృతివలన నీకవివరునకు తప్పకకల్గుఖ్యాతినెఱిగి శ్రీముద్దుకృష్ణయాచేంద్రులు,తనయౌదార్యము నెఱపియిట్టియనేక గ్రంథములను రచించు నట్లుచేసి యాంధ్రభాషావృద్ధికిందగుమార్గము నేర్పఱతురని నమ్ముచున్నాము.

ఇట్లు, వార్తాదర్శిని.

## కృతి ప్రశంస.

మహారాజరాజశ్రీ రాజా వెలుగోటి ముద్దుకృష్ణయాచేంద్రులవారి కంకితంబుగఁ దదాస్థానకవియగు బిరుదరాజశేషాద్రిరాజుచే విరచితంబగు నాంధ్రకుమార సంభవము మాపత్రికాస్థానముం గరం బలంకరించినయది. ఏదియైన నొకగ్రంథమునకు న్భాషాంతరీకరణము గావించునెడ ముఖ్యముగ గృత్యాదియందుఁ గవియొక్క సామర్థ్యము గొంచెమగపఱచుటకుఁ గృతిపతియొక్క వంశానుక్రమణికయే తగుస్థలంబై యుండనోపు, వెండియుం గవితావధూటి నష్టాదశ వర్ణనాయుతంబుగ సులక్షణవ్యాకరణార్థగుంభన పదరసాలంకార సాహిత్య సంప్రదాయ మృదుమధురపాక శయ్యాదిగుణమ్ముల బరిపూర్తి నొందించి రచించుట సులభమ్మని యెంచవలనుగాదు, ప్రస్తావితకృతిపతి చిరకాలంబుగ దశదిశాంతమ్ముల వ్యాపించియుండిన యశఃకాంతచే బ్రతిష్ఠావంతముగ నున్న యుత్తమరాజవంశంబున బుట్టినట్టివార లగుటం జేసి గ్రంథకర్త వారి యభ్యుదయముం గోరి యభివర్ణించిన వర్ణనాంశములకు దగియున్నాఁడనియే నిశ్శంకముగ నొప్పుకొనవలసి యున్నది అయినను వర్తమానమునం దిట్టివర్ణనలం తగరుచ్యములుగావని కొందఱి యభిప్రాయము అదెట్లున్నను గులశీలశమదమాదులు పారంపర్యముగ వచ్చునవియగుటచే దక్షాం

శస్త్రులెల్లెడలం బూజనీయులే యగుదురని ముమ్మాటికిని వ
క్కాణింపఁదగు. అరయ నీగ్రంథము మృదుమధురలలిత సౌ
ష్ఠవాది సుగుణసంపత్తిచేనొప్పుచుఁ జెలకుతుదనుండి మొద
టికి క్రమక్రమముగ రుచిగొనినయట్టుల సరణిఁజూడఁజూడ స
రసతగల్గి మధురిమ మీఱి చవులొసంగు చున్నది. వేయేల
యీగ్రంథాదిశార్దూల మట్టియొక్క పద్ధియము స్వకపోలక
ల్పితముగాఁగావింపఁగలవారేనైనంగద దీనిన్విమర్శింపఁబూ
ననర్హులగుదురు, వెండియు మనదొరతనమువారు కళాశా
లాప్రవేశ పరీక్షలకు నెక్కుడిదో యాద్యంతములు లేనివియు
బాలితయతుకడప్పుం దడికలలోనివియు నినుప గుగ్గిళ్లచందం
బున నవ్విద్యార్థులకు గొఱుకు పడనివియునగు క్లిష్టగ్రంథ
ముల బాఠములుపెట్టి విద్యార్థుల గష్టపఱచుటకంటె నిట్టి
యాధునిక సాత్త్వికగ్రంథముల నేలాయేర్పఱచింపరు, ఈగ్రం
థము ప్రథమశాస్త్రపరీక్షకుబఠనీయగ్రంథముగ నుండఁదగు
ననిమాయభిప్రాయము.

౧-౧౨-౯ర సం॥ ఇట్లు

ఆంధ్రప్రకాశిక.

శ్రీమదాంధ్ర కుమారసంభవము.

ఇది, శ్రీమత్కాళిదాస కవీశ్వర నిర్మితమైన కుమారసం
భవమను సంస్కృత కావ్యమునకు భాషాంతరీకరణము.

ఇద్దిమూలమువలెఁగేవలపద్యాత్మకమేయైనను. కాని, పద్య మునకుఁ బద్యమన న్సరిగాఁ గానంబడకున్నది. ఐనను, రచన సరసముగానేయున్నది. ఈయది, యీయదనఁ వేంకటగిరి సంస్థానాధిపానుజులైన, మ॥ రా॥ రా॥ రాజా వెలుగోటి ము ద్దుకృష్ణయాచేంద్రుల కంకితంబుగఁ దదాస్థానకవీంద్రుండు ను భయభాషా భూషణుండు నగు, శ్రీమద్బిరుదరాజ శేషాద్రిరా జకవిచే విరచితము; బ్రహ్మశ్రీ దేశభట్ల జానకీరామ పండితుల చేఁ బరిష్కృతము; వేంకటగిరి నగరీ మండనం బగు, శ్రీకాశీవి శ్వనాథ ముద్రాక్షరశాలయందు ముద్రితము; కృతినాథాజ్ఞ చే తఁ బ్రకటితము; కృతికర్తచేఁ బ్రేషితము; సంజీవనీ సముపల బ్ధము. ఇందు నిందునందువలెం దోష మేదియుఁ గానంబడద య్యెడు. గుణములేమోకొల్లగఁ గనఁబడుచున్నవి. ఇందువల్ల "శ్లో॥ దోషాణాంచగుణానాంచ త్వయిసంఖ్యానవిద్యతే । గు ణానామప్రమేయత్వా ద్దోషాణామ ప్యసంభవాత్ ॥" అను నీప్రాచీనశ్లోకమున కిది లక్ష్యమని చెప్పనొప్పియున్నది. ఈ కృతిలో నేదియెట్లున్నను, ఆది మాశీరూపమంగళాచరణ ప ద్యము; "శా॥ శ్రీమద్భీష్మసుతాక్షికజ్జలసమా శ్లిష్టోష్ఠుఁడై చేరి న । న్నీ మోవిన్నలుపేమియన్నఁదరుణీనీచూపుపై సోఁకఁగా। నీమాడ్కిన్నలుపయ్యెఁ జూడకయెముద్దిమ్మంచు సత్యన్భృత। ప్రేమం జేసెడు కృష్ణుఁడేలుతఁగృపఁ శ్రీముద్దుకృష్ణాధిపుఁ ॥" అను దీని కా కృతిపతిగారేమి ప్రతీకారమని కవికి సత్కార

ము చేసిరోకాని, మేమన్నం దీనికిం దగినట్టికవి నేరున్నత్కరిం
ప లేరని నొక్కి వక్కాణించుచున్నారము. కావునఁ గృతిక
ర్తమాట యేటికిఁగాని, కృతినాయకుని భాగ్యాతిశయమున
కెంతయు సంతసిలుచున్నారము. చేపెదునను క్రియాజన్యవిశే
షణము, చల్పెదునని యుండుట సముచితమని యారాజభూ
షణకవి కెఱింగించుచున్నారము. ఈకాలమున నిట్టికవుల ని
ట్టులేని సమ్మానించి తమసమ్ముఖమ్మున నునిచికొనుటం దలంచి
యా కృతినాయకులను విద్వత్ప్రభువులే యని వినుతించుచు
న్నాము. ఇంతటిప్రభు సమాశ్రయ మబ్బినందున నబ్బట్టుగా
జుకవి భాగ్యశాలియ యని భావించుచున్నాము. " భోజుని
వంటి రాజున్నఁ, గాళిదాసునివంటి కవి యప్పుడే చొప్పడు,,
ననులోకోక్తి యుక్తమనియే యిత్తఱిం దలంచుచున్నాము.

జయసం॥ఆశ్వయుజ బ॥
౧౨ గురువారము.

కొక్కొండ. వేంకటరత్నము
పంతులు. ఆంధ్రభాషా సంజీవనీ
పత్రికాధిపతి.

## అభిప్రాయములు.

శ్రీమదాంధ్ర కుమారసంభవమను పద్యకావ్యమును స్థాలీ
పులాక న్యాయముగా పరికించినాఁడను.

గ్రంథము లలితపదబంధ మనోహరమై శ్రవణ సుభగమై
అర్థస్ఫూర్తిగలిగి సలక్షణమై కదళీపాకంబున నొప్పారు

చున్నది. పదమునకర్థమై వాక్యార్థమేర్పడకపోవుట, తాత్పర్యము స్ఫురింపుచున్నను పదసమన్వయము లేకపోవుట, అన్వయము సామాన్యవలె నెటులీడ్చినను వచ్చుచునే యుండుట, యెట్లువచ్చినను తుదకు మోసమేలగుట, కవనమునిండతిక్కలుండుట, చదువువారికి తెక్కపట్టుకోనుట, అర్థము చెప్పఁబూనువారికి డగుత్తికపడుట, ఇత్యాద్యవాంతరములీకాలపుగ్రంథములలో బహుళముగా నుండునవి, దీనియందు నాచూచినవఱకు నగపడలేదు, ఈగ్రంథమునకు నేను మిగుల నానందించుచున్నాను.

వేదము వెంకట్రాయశాస్త్రి.
సంస్కృత ప్రధానపండితుఁడు, క్రిస్టియన్ కాలేజి,
మద్రాసు.

శ్రీ.

సీ॥ భర్త వెలుగోటిసద్వంశభవుఁడు ముద్దు।
కృష్ణయాచేంద్రబహదరు కీర్తిఘనుఁడు।
కర్త శేషాద్రిరాజుగాఁ గలుగు శ్రీకు।
మారసంభవమునుగంటి మానితముగ॥

క॥ మృదుమధురంబగు పలుకులు।
సదమలచరితంబు గుణము సదలంకృతులున్।
బొదలఁగ శృంగారం బే।
హృదయముఁ గఱఁగించ దీసుకృతికన్యకయున్॥

గీ॥ ధరణిఁ జేపట్టు వారేది తిరిగితిరిగి।
పూని శేషాద్రివలుకఁగ ముద్దుకృష్ణు।
జెలఁగి భర్తనుగాఁ గొని శ్రీకుమార।
సంభవముఁ గాంచె నాంధ్రభాషావధూటి॥

గీ॥ విబుధ హర్షకరం బౌట వెలయు భర్త।
రాజమౌళిశుఁడై యుంటఁ దేజుమీఱ।
నమ్మికగనంగ లోకహితమ్ము శ్రీకు।
మారసంభవ మిలనుఁ జెన్నారుకున్న॥

ఉ॥ సాంద్రవిభుత్వభూషితులు సారధనాఢ్యులు ...
రా। జేంద్రులుమాతృభాషను న హీనదయాళు ... ప్రాచీనస్వ
శ। శ్చంద్రికనిత్యరాకలవశంబుగఁ జేసి జగంబుమీఱుయా। ...
దు శ్రీ ముద్దుకృష్ణమను జేంద్రునిఁ బోలఁగ లేరు గాకిలన్॥

క॥ కవిజీవాధారంబుగ।
కువలయమిత్రుండునగుచు కోమరగుని పిన్।
భువన స్తవనీయుండై।
భువి వెలిఁగెడు ముద్దుకృష్ణ భూపాగ్రణియున్॥

వా - సుబ్బరావు.

శ్రీరస్తు.

క॥ శ్రీబిరుదరాజసంతతి।
జాబుధనికరప్రదత్త సార్థకబిరుద।
ప్రాబల్యభవ్యకవితా।
శ్రీబంధురవిమలపదవి శేషాద్రికవీ॥

ఉ॥ నాదువిమర్శనమ్మునుఁ గమ్ముగ నెంచియదిచ్చగించి మీ। రాదరముంచి పంచినమ హాకృతినాంధ్రకుమారసంభవం। బీదినమేపఠించిముగి యించితిఁ గాంచితినెంతయేనిస। మ్మోదముతత్ప్రబంధముప్ర భూతగుణమ్ములఁ దేజరిల్లుటన్॥

గీ॥ మున్ను మీరంచినట్టి చంపూవిరాట।
పర్వమునకన్న మిన్నయై పరఁగనిద్ది।
సానవెట్టినరత్నంబు చందమొందె।
నతులభవదీయ కవిత శేషాద్రిరాజ॥

మ॥ సరసాగ్రేసరచక్రవర్తి యువిభా స్వత్పాండితీమండి తుం। డరయన్వేంకటరత్న సత్కవి తదీయస్తోత్రపాత్రంబుగా। బరఁగన్ మీకృతిసత్కృతీయిఁకఁ బరోభాగు ల్గుశంకాసము। త్కరులైనం దరమేమి? సాదరత విద్వాంసుల్ప్రశంసింపఁగన్॥

వసంతతిలకము॥ దోస్సైకదృక్ష్నిచయ దుర్భర గర్వమారన్। భాషాంతరీకరణ పాండితి బాగుమీరన్। భాషాభివృద్ధి కీటు పాటుపడంగనిచ్చల్। శేషాద్రిరాజకవి శేఖర మీకు మేలౌ॥

దుర్భా- సుబ్రహ్మణ్యశర్మ, నెల్లూరు.

శేషాద్రిరాజ కవికి సభవా రొసగిన

పంచరత్న పద్యములు.

ఉ॥ శ్రీద్రుహిణాధిప ప్రియుఁడు శీతకరాంకిత శేఖరుండు, ని। ర్నిద్రసురద్విపన్ని కరనిత్యని షూదన నిశ్చలుండు, క। ల్పద్రుపదాన్యుఁ డీశ్వరుఁడు, భక్తజనప్రియుఁ డిచ్చుఁ గాత శే। షాద్రికి, శ్రీయుఁ గీర్తియు ద్విషజ్జయ మున్ సదభీష్టసిద్ధియున్॥

ఉ॥ మాద్రికిమీరు తేటలగుమాటలు పాటిల, గోస్తనీరసా।
త్యుగ్రముగాఁగ, నాంధ్రకవికుంజరులెల్లరు నుల్లసిల్లసం। విద్ర
మ, భద్రమూర్తియయి, వేడుకనాంధ్రకుమారసంభవం। బద్రి
సుతాధినాథు కరుణాప్తి, రచించె, నితండు బేలయే? ॥

ఉ॥ హా! సురభాషభాసురములౌ సుకృతుల్ సుకృతు ల్రచిం
చివి। ద్యాసమభాసమానులయిరంట, జగద్విదితంబు, సంస్కృ
తా। భ్యాసవిలాసభాసులకె యయ్యె విగవ్యములౌటనాంధ్ర
పా। హాసరసుల్ కృతజ్ఞులురసజ్ఞులు వానిఁదెనుంగు చేసినన్॥

చ॥ సరసజనైకసన్నుత పరిసంగములంగ నవార్థ, సారధీ।
స్ఫురణఁ గృతుల్ కృతుల్ సలుపఁ జూడఁగ లేకయపార్థసారధీ।
స్ఫురణశిలీముఖప్రతిమముల్, పలుకుల్ నెఱపంగఁజాలమేలె?
రసికుకీర్తినద్రిశశిలేఖఁగళంకముఁరీతిఁగ్రాలదే? ॥

ఉ॥ ధన్యుఁడుకృష్ణరాయవసుధాపతిపోయిననాఁటగోలెసా।
మాన్యనృపుల్ తనుంగనమి మక్కువఁజిక్కినయాంధ్రకాంత నే
డన్యులరీతిఁగాకపరమాప్తి మెలంగెడిముద్దుకృష్ణరా। జన్యుని
పారిపుగాంచెను, రసజ్ఞుఁడతండు నృపాలమాత్రుఁడే?

డిసంబరు తే౧౭ది<br>౯రవ సం॥

ఇట్లు<br>నెల్లూరి మహాసభ వారు.

క॥ శ్రీవెలయుముద్దుకృష్ణమ।
హీవరకారుణ్యపాత్ర హేలామిత్రా।
శ్రీవిభుభజనాసక్త।
కావనసుమనీషయుభయ భాషాభూషా॥

క॥ నీవు రచించిన కబ్బము।
నే వేడుకఁ గంటి గోస్తనీరసప్రాదు।
ర్భావంబై యాంధ్రవచో।
జీవంబై తనరెసుకవిశేఖరు లలరన్॥

చ॥ విలసితవాక్చమత్క్రియల వేడుక పుట్టఁగఁ జేయఁజా
లుది । మ్ములనిరుబాసలిందురస ముల్వెలయన్ గవితాలతాం
తముల్। మొలువఁగఁ జేయఁజాలుదిటు ముద్దులు గుల్కు సగద్య
పద్యమై । యలరు కుమారసంభవము నాంధ్రమున న్రచియిం
చుట బ్రమే॥

తే.గీ॥ శబ్దసౌష్ఠవమును రసజ్ఞతయు లేని।
మూఢుఁడును వృద్ధునకు నెట్లు ముదముఁ గూర్చు।
కావ్యకన్యక చతుర శృంగారరసిక।
యువశిఖామణులకె కాక యుక్తి యందు॥

క॥ కమ్మని పల్కులనెవ్వరిఁ।
గిమ్మన నీకుండఁగలిత గీల్కొల్పితిని।
సొమ్మగు సుమ్మిది యేసొము।
చ్చొమ్మును లేదిందు నెందు శేషాద్రికవీ॥

ఇట్లు,
మిత్రుఁడు, కొ. శ్రీనివాసార్యకవి.



శ్రీమదాంధ్ర కుమారసంభవము;—

మ-రా-రాశ్రీ, రాజా వెలుగోటి ముద్దుకృష్ణయాచేంద్ర బహదరుగారి యాస్థాన కవీంద్రుండగు, మ-రా-రాశ్రీ, బిరుదరాజ, శేషాద్రిరాజ కవివర్యునిచే రచితమైన యీగ్రంథతల్లజంబు మాకార్యస్థానంబు జేరెను, ఇయ్యది కాళిదాస కవీశ్వర విరచితంబగు సంస్కృత భాషయందలి కుమారసంభవంబునకు నాంధ్రీకరణము, తొలుత నిక్కవి శిరోమణిచే జంపువిరాటపర్వంబును, పుష్పబాణ విలాసంబును దెనిగింపఁబడినవి, ఈతని భాషాంతరీకరణశక్తి నియ్యాంధ్ర కుమారసంభవమే తెలుపుచున్నది, కవి వాగ్ధోరణి మనోహరంబు వర్ణనలన్ననో కాళిదాసువేయయ్యెను, కథాసరణి యుల్లాసజనకంబు, ఇట్లుండ నికావ్యంబు సుధీజనసన్మానితంబగుట యబ్బురంబా? ఇకాలంబున నిట్లాంధ్రకవుల నాదరించి తెనుఁగుబాస పొలతిపెంపునకుఁ బాడుపడురాజు లీముద్దుకృష్ణయాచేంద్రులుదక్క నొరులులేమికి దగచువారు.

ఇట్లు,
వైజయంతిపత్రికాధిపతి,
పి. శ్రీనివాసార్యర్.